# శీతా కాలపు మీ విశ్రాంతి కేవలం కొద్ది గంటల దూరంలోనే ఉంది.



భారతదేశంలోని ప్రతీ ప్రాంతం కూడా మీకు వేయి వసంతాల శోభలతో ఆనందాన్ని కలిగిస్తుంది. కొద్ది గంటలలోనే మీరు చేరుకోవచ్చు—విమానం ద్వారా.

## ఉత్తరం

**కాశ్మీర్**: శీతా కాలపు విశ్రాంతి దినాల అపూర్వ అనుభూతికోసం. అనేక మంచు క్రీడలు. శ్రీనగర్ విమానాశ్రయం ప్రక్కనే.
**సిమ్లా**: కొండలలోని ఆనంద నిలయం. అతి దగ్గరలోని విమానాశ్రయం—చండీఘడ్.

**రాజస్థాన్**: ఎండాకాలంలో మీకు సరిగ్గా సరిపడిన ప్రదేశం. జ్ఞాపకాలు వెన్నాడే రాజ ప్రాసాదాలు, కోటలు. జోధ్‌పూర్, జైపూర్, ఉదయపూర్‌లలో విమానాశ్రయాలు.

## దక్షిణం

**కోవళం**: అద్భుతమయిన సముద్ర తీర విశ్రాంతి కేంద్రం. యోగ, ఆయుర్వేద చికిత్స సదుపాయాలు. అతి దగ్గరలోని విమానాశ్రయం—తిరువనంతపురం.

**మహాబలిపురం**: గొప్ప సముద్రతీర దేవాలయాలు. బంగారు కాంతుల ఇసుక తీరాలు, నీలి సముద్రాలు. అతి సమీపంలోని విమానాశ్రయం—మద్రాసు. కవ్‌లాంగ్ బీచ్‌కి కూడా మార్గం.

**కంచీపురం**: 1000 దేవాలయాల నగరం. అందమైన, అద్భుతమైన చేనేత సిల్కు వస్త్రాలకు ప్రసిద్ధి చెందింది. అతి దగ్గరలోని విమానాశ్రయం—మద్రాసు.

## తూర్పు

**కాజిరంగ**: వన్యమృగ సంరక్షణ కేంద్రంలో ఏనుగు పైన కూర్చుని ఖడ్గ మృగాల ఫోటోలు తీసుకోవచ్చు. అతి సమీపంలోని విమానాశ్రయం—జోర్‌హాట్.

**మానస్**: మానవుడు అదుపులో పెట్టని అద్భుతమైన అడవులు. ఇక్కడి వన్యమృగ సంరక్షణ కేంద్రంలో అనేక రకాల జంతువులు ఉంటాయి. అతి సమీపంలోని విమానాశ్రయం—గౌహతి.

**బుద్ధగయ**: బుద్ధ భగవానుడు జ్ఞానోదయం పొందిన క్షేత్రం. చుట్టూ ఉన్న పవిత్ర ప్రదేశాలు—రాజ్‌గిర్, నలంద. అతి సమీపంలోని విమానాశ్రయం—పాట్నా 113 కిలోమీటర్ల దూరంలో ఉంది.

**దీఘా**: బంగారు కాంతుల ఇసుక, బంగాళా ఖాతపు చల్లటి నీలి జలాలు. కలకత్తా విమానాశ్రయం నుంచి సులువుగా ఈ బీచి విశ్రాంతి కేంద్రం చేరుకోవచ్చును.

## పడమర

**గోవా**: తెల్లటి నురగలతో అందంగా ఉండే సముద్ర తీరంలో గంటల తరబడి కూర్చోవచ్చు. డబోలిమ్ విమానాశ్రయంలో ప్రారంభమయ్యే విహార యాత్ర.

**బొంబాయి**: పశ్చిమ భారతావనికి ముఖ ద్వారం. నిత్యం హడావుడిగా, చైతన్యంతో తొలికసలాడే గొప్ప నగరం. అంతర్జాతీయ విమానాశ్రయం.

**అహ్మదాబాదు**: గాంధీ మహాత్ముని సబర్మతీ ఆశ్రమం, కదిలే స్తంభాల మసీదు. మధ్య, ఆధునిక యుగాల సమ్మేళనం. ఆధునికమైన విమానాశ్రయంతో.

ఎక్కడనుంచి అయినా కొద్ది సేపు విమానయానమే.

ఇండియన్ ఎయిర్‌లైన్స్ అతి త్వరితంగా వెళ్ళే విమానాలతో, దేశమంతటా గల సర్వీసులతో మిమ్మల్ని ప్రతీ చోటుకు చేరవేస్తుంది.

మీ ట్రావెల్ ఏజెంటు అన్ని ఏర్పాట్లతో మీకు సహాయపడతారు.

CAS-344-Tel

పలు ప్రదేశాలకు
IA ద్వారా
ప్రయాణం చేయండి

**ఇండియన్ ఎయిర్‌లైన్స్**

## నూతన సంవత్సరం

# ఎలావుండాలని మీరు అభిలషిస్తున్నారు?




1979 వ సంవత్సరం పేలవంగా యాంత్రికంగానే వుంటుందని మీరు భావిస్తుంటే మేము చెప్ప కలిగేది ఏమీ లేదు




అలాకాక నూతనసంవత్సరం ఊహించివిరుగని మార్పును కొనితెచ్చేలా అద్భుతంగా ఉత్తేజ పూరితంగా వుండాలని మీరు ఆశించుతుంటే మాత్రం ఆ బాధ్యతను మాకు అప్పజెప్పండి!

అసాధారణ మాసపత్రిక రేపు ఇప్పటికే వేలాదిమంది జీవితాల్ని ఉన్నతంగా తీర్చి దిద్దింది. ఒక్క సంవత్సరంవ్యవధిలో మీకు నూతనజీవితాన్ని వాగ్దానం చేస్తోంది



## ఉచితం

## నూతన సంవత్సరాన్ని ఉజ్వలంగా ప్రారంభించ డానికై ముందుగా ఈ విలువైన డైరీని ఉచితంగా స్వీకరించండి!




మీరు చేయవలసిందల్లా

- ★ రేపు మాసపత్రికకు చందాదారులుగా నమోదుచేయుమని కోరుతూ ఇప్పుడే ఈ క్షణంలోనే మీ పూర్తి చిరునామాతో కార్డు వ్రాయండి.
- ★ వెంటనే దాదాపు రు 10/- విలువచేసే డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపిస్తాము. (పోస్టుఖర్చులు దాదాపు 5/- మేము భరిస్తాము)
- ★ రేపు మాసపత్రిక సం॥ చందా నిమిత్తం వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు రు. 25/- చెల్లించండి.
- ★ రేపు మాసపత్రిక ప్రతినెలా మొదటివారంలో మీకుచేరేలా సం॥పాటు పంపుతాము.

## మీజీవితాన్ని అద్భుతంగా రూపొందించే అవకాశాన్ని మాకు కల్పించండి!




ఏలూరురోడ్
విజయవాడ-520 002.














## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 – 1972]
శుక్రవారం : 22-12-'78
కాళయుక్తినామ సం. మార్గశిర బ. అష్టమి
**సంపుటము 72 : సంచిక 15**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# మీ జీవితాన్ని నిండైన రంగులతో సింగారించడానికి ఉత్సాహపడుతున్నది-బిన్నీ

అందాలు చిందే వెన్నో జరుగుతున్నవి బిన్నీలో నమ్మకంగా
వాడదగిన బిన్నీ నూలు మరియు పోలిస్టర్ దుస్తులు కొత్తకొత్త
అందచందాలతో అలరారేటట్లు తయారవుతున్నవి బిన్నీలో మరింత
వైవిధ్యంగల రంగులు పెక్కు రకాల నిండైన రంగురంగుల ప్రింటులు
మీ చొక్కాలు, దుస్తులు మరింత ఆకర్షణీయంగా ఉండే నిమిత్తం...
మరింత మనోహరంగా ఉండే నిమిత్తం మీ జీవితాన్ని
శోభాయమానం చేయుడానికి బిన్నీకి అవకాశమివ్వండి.




CAS BC 8/78 TEIA

## ముఖచిత్రం

"తన్మయత్వం" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా ఆకర్షణీయంగావుంది. ప్రతివారం ఆంధ్ర పత్రిక మంగళవారం నాటికే అందేది. కాని గత నాలుగు మాసములనుండి ప్రతి సోమవారం నాటికే మా చేతులలోకి వాస్తోంది. ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ఈ వారం ఒకే కథను ప్రచురించటం అన్యాయంగావుంది.

పి. వి. రామనాధరావు. [మధిర]

* * *

8.12.78వ తేదీ పత్రిక ముఖచిత్రం సింప్లీ సుపర్బ్. ఆ అమ్మాయి "తన్మయత్వ స్టిల్" చూచి రోజంతా తన్మయత్వంలో మునిగిపోయాము. మరీ ఇంత ఆకర్షణీయంగా అమ్మాయిల ముఖచిత్రాల్ని వేసి మమ్మల్ని పిచ్చివాళ్ళని చేయకండి—

ఎమ్. వి. సుబ్రమణ్యకుమార్. [పేతేరు]

## శీర్షికలు

20-10-78. తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక "దసరా సంచిక" చాల బాగుంది. "శ్రీ కలకత్తా దుర్గ" ముఖచిత్రం దసరా సంచికకు కొత్త అందాన్ని ఇచ్చింది. చక్కని ముఖచిత్రాన్ని అందించిన సంపాదకులకు మా హృదయపూర్వక అభినందనలు.



ఆణిముత్యాల వంటి చక్కని కథలను ప్రచురించారు. "స్వయంవరం", "పరిహారం", "పిచ్చి మనుష్యలు", "ఇదేం నాటకం" ఈ నాలుగుకథలు ఒకదానికి ఒకటి మించిఉన్నాయి.

"నగంలో ముగింపు", "రాగ ద్వేషాలు" సీరియల్ కథలు ఇంటరెస్టుగా ఉంటున్నాయి.

"ఈనాటి వనితాలోకం"లో కొమ్మారెడ్డి స్వప్నగారి రచన కుండ బ్రద్దలు కొట్టినట్టుంది.

జి.వి.జి గారి పేజీ వెరీఫైన్. "జనప్రియ" సినిమావిశేషాలు రసవంతంగా ఉంటున్నాయి.

రామలక్ష్మిగారు జవాబులు మంచి ఇంటరెస్టుగా ఉంటున్నాయి. ఈ సంచికలో కార్టూన్లు చదివి నవ్వుకున్నాం.

కాంతిశ్రీ. [బరంపురం]

## ఆంగ్లపదాలు

మీ పత్రికలో కథల భాష విచిత్రంగా ఉంటున్నది. ఉదాహరణకు "రాగద్వేషాలు" సీరియల్ కథలో ఆంగ్లము వాడకం లేనిదే వాక్యం పూర్తి కాదన్నట్టుంది. (పార్టీస్, యూజ్ లెస్ కాలర్, ఐ హేట్ ఇట్, హెల్పర్, లీగల్లీ మారీడ్, సిటిజన్‌షిప్ ఇంకా ఎన్నో.) మీ పత్రికలు చదివే ప్రతిఒక్కరు ఆంగ్లము తెలిసిన వాళ్ళనని అనుకోవచ్చా. ఈ విధంగా సాగితే కొన్ని రోజులకు తెలుగు, తెలుగులా ఉంటుందా అని నా అనుమానం. ముఖ్యంగా రచయితలు రచయిత్రులు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని వ్రాయాలి.

యం. రాజగోపాల్. [ఏయిర్ ఫోర్స్, కేరాఫ్ 99 ఏ పి. ఓ.]

## కథలు

17-11-78 సంచికలో కథలు కమనీయముగా వున్నాయి. ముఖ్యంగా "రమా-నేనూ-సరోజా" యన్న కథానిక సి.వి. సూర్యనారాయణమూర్తి గారిది మాకు ప్రత్యేకంగా చాలా నచ్చింది. కార్టూన్లు మా స్నేహబృందాన్ని అమితంగా నవ్వించాయి.

గంటా ఉమాశంకర్‌రెడ్డి, చిన్నతంబి
న్యాయపతి రమేష్‌బాబు, నందగిరి
సత్యనారాయణమూర్తి, మోహన్‌ప్రసాద్.
[బరంపురం.]

సీరియల్.....

# గవర్నెస్ కరుణ

## గంటి వెంకటరమణ

(గత సంచిక తరువాయి)

కరుణ మంచం మీద కూర్చుని ఆలోచించ సాగింది. లైట్లతో గాంధీనగర్, సిటీ కళకళ లాడుతూంటే తల్లి లేని వెలితి ఆ పిల్ల మనసుని అంధకారంలోకి తోసేస్తోంది. తల్లి వెళ్ళి పోవడం యింత అవమానంగా తోస్తుందనుకోలేదు స్కూలుకి వెళ్ళగానే అందరూ చెవులు కొరుక్కుంటున్నారు ఎవరో అనామకులు ఏదో చేశారంటే యీలోకానికి అంత పట్టదు. పేరు ప్రఖ్యాతులున్న యిద్దరు డాక్టరు ! 'డాక్టర్ భార్గవ భార్య డాక్టర్ మేనక లేచి పోయింది' ఎక్కడ, ఏనోట్లో విన్నా యివే మాటలు 'ష్'.

కరుణ దగ్గరకి రాగానే మాటలు చటుక్కున ఆగిపోతున్నాయి తల్లిని గురించి సీరియస్‌గా తనకి వినిపించాలనే మాట్లాడుతున్నారు వీళ్ళందరూ. తను ఏం చేయగలదు

మెట్రిక్ పరీక్షలు మొదలయ్యాయి పూర్తి అయ్యాయి. కరుణ యీ మాటలేవీ పట్టించు కోవడం లేదు. తండ్రికి పుస్తకాలు చదివి వినిపించడం, అతను పడుకున్నాక తను చదువు కోవడం యింతే తెలుసు కరుణకి. డైనింగ్ టేబుల్ దగ్గర చదువు కుంటూంటే నోటికి అందిస్తుంది దర్శన్, జడలు వేసి స్కూల్ యూనిఫామ్ సిద్ధం చేస్తుంది.

వేళకి చాయ్ యిస్తుంది. పుస్తకాలు సర్ది యిస్తుంది. కంటి పాపలా చూసుకునే దర్శన్ సపర్యల మధ్య కరుణ పరీక్షలు చాలా బాగా రాసి బయట పడింది.

ఈ మధ్య యీ యింటికి ఎవరూ రావడంలేదు. తండ్రి క్లినిక్‌కి వెళ్ళడం మానేశాడు. అతను ఎంతసేపూ యింట్లోనే వుంటూంటే కరుణకి విసుగ్గా వుంది. ఒకరోజున తండ్రి దగ్గరకి వచ్చి మనం 'హంటింగ్‌కి వెడదాం డాడీ' అంది.

'హంటింగ్‌కి వెళ్ళి చాలా రోజులైయింది. పదండి' సెలవలు యివ్వగానే తండ్రిని సతాయించడం మొదలు పెట్టింది కరుణ. పిల్ల పోరు పడలేక ఎప్పుడో మరచి పోయిన హంటింగ్, హార్స్ రైడింగ్ తిరిగి గుర్తుకు తెచ్చు కుంటున్నాడు - ఒకప్పుడు - రెండేళ్ళ క్రితం కాబోలు కరుణ పేచీ పెడితే ఆపిల్లకి నేర్పించాడు. తిరిగి యిన్నాళ్ళకు రైఫిల్ తీసుకున్నాడు.

సెలవలకి దర్శన్‌తో బాటు కాశ్మీర్ వెళ్ళాడు. అతను ఎక్కడికి వెళ్ళినా మేనక జ్ఞాపకాలు అతన్ని పీల్చి పిప్పి చేస్తున్నాయి. రాత్రిళ్ళు అయేసరికి ఆమె లేని పక్కవైపు చూసి కళ్ళ నీళ్ళు తెచ్చుకునేవాడు. మనిషి కేవలం భార్యని అవసరం కోసమే చూస్తాడనుకోవడం భ్రమ. భార్గవ భార్యని అమితంగా ప్రేమించాడు. ఆ ప్రేమని అతను మాటల్లో వ్యక్తం చేయలేక పోయినా యిప్పుడు యిలా ఒంటరిగా పక్కమీదకి చేరుకోవాలంటే అతనికి చచ్చిపోవాలనిపిస్తోంది. మేనక అప్పట్లో ఏమి అనేది కాదు. ఈ ప్రపంచం, సర్వం అన్నీ భార్గవే అయినట్లుండేది. అటువంటిది యిప్పుడు తనకీ శిక్ష ఏమిటి ? అతను రాత్రి త్రాగేసి మంచానికి అడ్డంగా తలగడ వేసుకుని పడుకునేవాడు.

రోజులు యాంత్రికంగా గడచి పోతున్నాయి. కాలేజీలు తెరిచారు. కరుణ ఫస్టు క్లాసులో పాసైంది. పి. యు. సి లో చేరే ముందు భార్గవ సైన్సు సబ్జక్టు తీసుకోమన్నాడు. కరుణ నవ్వి 'ఒద్దు డాడీ ఆర్ట్సు చాలు' అంది. అతనేమీ అనలేకపోయాడు.

మేనక ఎక్కడుందో ? ఎప్పుడైనా తలచుకుంటోందో లేదో ? ఈ ఆలోచనలు భార్గవకి కలిగేవి. కరుణ ఆకాశంలోకీ, లక్ష్మీనారాయణ మందిర్ వైపూ, వైష్ణవదేవి కొండలో మూస్తూ అనుకునేది. హై సొసైటీ చివరికి ఏంచేసింది ? తల్లి దారి తప్పేందుకు యిదే కారణం అయివుంటే ఏం చేయాలి మనుష్యుల్ని త్రాగేయడం కల్చరా ? మగవాళ్ళలో సమానంగా పరుగులు పెట్టడం కల్చరా? ఇవన్నీ లేకపోయినా సగౌరవంగా కాలి ఆత్మీయ్యలా బతికేయవచ్చునే ? యీ యింటికే యీ మువ్వ వచ్చిందా ? లేక యీ హై సొసైటీ మనుష్యులందరి మనస్తత్వాలు యింతేనా ?

ఆ మధ్యాహ్నం ఏమి తోచక 'మిశ్రా' యింటికి వెళ్ళింది కరుణ రాగానే సగౌరవంగా ఆహ్వానించే మిశ్రా అతని భార్యా సోఫాలోంచి లేవలేదు. పైగా భార్యా భర్తలు యిదరూ ఒకళ్ళ మొహాల్లోకి మరొకళ్ళు చూసుకున్నారు. కరుణ 'హల్లో అంకుల్' అంది.

'హలో' అన్నాడు మిశ్రా.

'రా' అంది మిసెస్ మిశ్రా. పదినిమిషాలు కూర్చున్నా ఏమాటా పెగిలి రాలేదు కరుణకి. మొహ మొహాలు చూసుకుంటూ ఎంతసేపు గడపడం ? కరుణ 'వెళ్ళొస్తా' అని చెప్పి చంద్రభాను యింటికి రాగానే బయలు దేరింది. అక్కడ కూడా కరుణని ఎవరూ పలకరించలేదు. తల్లి వున్నప్పుడు 'కోడలు, కోడలు' అని వెంటబడిన వీళ్ళేనా యిప్పుడు అంటరానిదాన్ని చూసినట్లు చూస్తున్నారు. స్కూల్లోనూ, రోడ మీదా జరిగిన అవమానం ఆమెను ఎప్పుడూ బాధించలేదు. కానీ తమ యింటికి వచ్చి అర్ధరాత్రి వరకూ తాగి తందనాలాడి చివరికి తను వాళ్ళకిగానీ వాళ్ళు తనకిగానీ ఏమీ కారు... ఎప్పుడూ విరగం అన్న ధోరణిలో వున్న మిశ్రా, చంద్రభాను యిళ్ళ పద్ధతులు కరుణని నిజంగా గాయపరచాయి.

ఎవరి నోట్లో విన్నా తల్లి గురించి తప్ప

జరిగినకథ : 2 డాక్టర్ భార్గవ, మేనకల ఏకైక పుత్రిక కరుణ. తన తల్లి, మూర్తితో చనువుగా ఉండటాన్ని చూచి సహించలేక పోతుంది. ఊరి నుండి తిరిగి వచ్చిన భార్గవకు, మేనక మూర్తితో లేచిపోయిందని దర్శన్ చెపుతుంది.

వేరే ఏ విషయమూ దొర్లడం లేదు. తన తల్లేమో ఎలిజిబెత్ టేలర్, క్రిస్టీన్ కీలర్ అంత అన్యాయంగా ప్రవర్తించలేదే. ఎందుకిలా ఆడిపోసుకుంటుంది సంఘం? దర్శన్‌తో చెప్పి కళ్ళనిండా నీళ్ళు తెచ్చుకుంది కరుణ. దర్శన్ ఆ పిల్లని దగ్గరకు తీసుకుని 'పిచ్చిదానివి కరుణా, నువ్వేడుస్తుంటే నీతో ఎవరూ పాలు పంచుకోరు. నువ్వు నవ్వినప్పుడు నీ చుట్టూ చేరతారు. ఇది సంఘం' అంది. అనుభవాలతో పండిపోయిన దర్శన్ యిప్పుడు యీ కష్టసమయంలో ఆ తండ్రీ కూతుళ్ళను విశ్వాసంగా ఆదుకుంటోంది.

కాలేజీలో చేరిన కరుణ ఎవరితోనూ అనవసరంగా మాట్లాడదు. గంభీరంగా ఉంటూ ఎప్పుడూ పుస్తకాలు చదివే ఈ పిల్ల అంటే గౌరవం వున్నా యీ పిల్ల వెనుక వున్న మహా చంద్రుడిలో మచ్చలా కనిపిస్తుంటే అనుకున్నంత గౌరవం యివ్వలేక పోయేవారు కాలేజ్ స్టూడెంట్స్.

ఫస్టుయియర్ బి. యే కూడా అయిపోయింది. కరుణ యింగ్లీషు లిటరేచర్ తీసుకుంది. ప్రతి సంఘటనా నిన్న మొన్న జరిగినట్లు వున్నా వాటి వయసు అప్పుడే రెండు ఏళ్ళు. భార్గవ చిన్నప్పటి నుంచీ కూతుర్ని పాశ్చాత్యుల మాదిరి పెంచాడు. అతని దృష్టిలో క్రమశిక్షణకున్న ప్రాముఖ్యత మరి దేనికీ లేదు.

కరుణ బాబ్డ్ హెయిర్ టెన్తుక్లాసులో వుండగా మానేసింది. చేతులకు గాజులు వేసుకుంటే భార్గవకి యిష్టం వుండేది కాదు. అతను బొట్టు పెట్టుకోనిచ్చేవాడు కాదు. మినీస్కర్ట్స్ వేసుకునేది కరుణ. కాళ్ళ కుచ్చిన పరికిణీ తప్ప అటువంటి వెరైటీయే లేదు ఆమె దగ్గర. తల్లి వెళ్ళిపోయాక చేతికి గాజులు వేసుకుని, తిలకం దిద్దుకోవడంతో బాటు ఫుల్‌వాయిల్ చీరలు కట్టుకుని జడ వేసుకోవడం మొదలు పెట్టింది. కాలేజీ మొత్తం ఒకసారి చూసిన కరుణని వెనక్కి తిరిగి మరోసారి చూడకుండా వుండలేరు.

భార్గవ కాలిఫోర్నియాలో వుండగా వేసవి కడుపులో పడింది యీ పిల్ల. ఆ వాతావరణం మహాత్మ్యం ఏమో కళ్ళు నీలమూ కాకుండా ఎరుపూ కాకుండా గమ్మత్తుగా వుంటాయి. జుట్టు [illegible] అల మెత్తగా సిల్కు దారాల్లా వుంటుంది. యాపిల్ పండు రంగులో వుండే ఆ పిల్ల బుగ్గలు మరీ అందంగా వుంటాయి. కాశ్మీరు వాతావరణంలో పెరగడం వల్ల కరుణ రంగు తేరి వుంటుంది. ఎర్రని పెదాలు, నల్లని కనురెప్పలూ, కనుబొమ్మలూ వున్న ఆ పిల్ల కాలేజీకి రావడం ఓ రోజు మానేస్తే అందరికీ బోర్‌గానే వుంటుంది.

భార్గవ [illegible] వుంటాడు. కరుణ మరో సంవత్సరం భారంగా గడిపింది. దర్శన్ మనసులో ఎన్నో కోరికలున్నాయి. వాటిని భార్గవ ముందు బయట పెట్టాలంటే ఆమెవల్ల కావడం లేదు. ఆ యింట్లో దాసీదానిలా అడుగు పెట్టడంవల్ల దర్శన్ కోరికలూ, ఆశలూ అన్నీ సమాధి అయిపోతున్నాయి. భార్గవ మంచం మీద నుంచి లేవడం లేదు. ఈ మధ్య ఆ యింటి !



కొత్తవాళ్లు వస్తున్నారు. పగలు తాగడం మానేశాడు భార్గవ. ఆ సమయంలో ఆ నాలుగు గోడలమధ్యా జరిగే రాచకార్యాలు ఏవిటో వినాలనిపిస్తుంది దర్శన్‌కి. తాగడం తైతక్కలాడడం అంతకన్నా వినోదాలు ఏవీ లేకపోయినా, విన్నట్లు వయం అనిపిస్తున్నాయి.

కరుణకి సాయంత్రం ఐదుగంటలకి 'టీ' యిచ్చింది దర్శన్. కరుణ 'టీ' తాగుతూంటే నెమ్మదిగా వచ్చి పక్కకు చేరింది. 'నీకు పెళ్లి చేస్తే బాగుండును. మీ డాడీని నువ్వు చూసుకుంటూ వుండేదానివి అప్పుడు. నాకు వయస్సైపోతోంది. రామ్ లాల్ రమ్మని మరీ మరీ వుత్తరం రాశాడు. నువ్వా పెద్దదానివయ్యావు. ఎప్పుడో ఒకప్పుడు నిన్ను అత్తవారింటికి పంపాల్సిందే కదా.'

కరుణ కళ్లు పెద్దవి చేసుకుని ఆశ్చర్యంగా చూసింది. 'నువ్వు రామ్‌లాల్ భయ్యా దగ్గరికి వెడతావా దర్శన్. నేను ఎలా వుండగలను?'

'అందుకే నీకు పెళ్లిచేస్తే బాగుండును అంటున్నాను.'

'నా పీడ వదిలించుకోవాలని వుందా?'

'రామరామ. అన్యాయంగా మాట్లాడుతున్నావు కరుణా. నువ్వు 'పీడ' అనుకుంటే అర్ధరాత్రి మీ అమ్మకోసం పేచీపెట్టి నన్ను గిల్లి, కరిచి యుద్ధం చేసినప్పుడే వదిలి వెళ్లిపోయేదాన్ని. నువ్వు నా బిడ్డవు.'

'మరి నా పెళ్లి విషయం ఎత్తకు.'

దర్శన్ ఆలోచిస్తూండిపోయింది. ఈ ఏడాది రిజల్ట్సు వస్తాయి. ఎం. ఎ. అంటారు. ఆ తరువాత రిసెర్చి అంటారు. కాలం గడిచి పోతూనే వుంటుంది. ఏళ్లు దాటిపోయాక పెళ్లి చేసుకున్నా మానేసినా ఒకటే. వయసులో వున్నప్పుడే ముద్దూ ముచ్చట. ఇప్పుడు కరుణని పెళ్లి చేసుకునే సాహసం ఎవరు చేస్తారు. పళ్లి జడపదార్థంలా పెరిగిందేం ఈ కరుణ. బహుశా తను పెంచి తన చేతి ముద్దలు తినడం వల్లనో ఏమో తల్లీ తండ్రీ యిద్దరూ భవిష్యత్ చూసుకున్నారు కాదు. ఇప్పుడీ పిల్ల గతేంకాను? భార్గవ మాట్లాడే కొత్త మనుష్యులందరూ ఎవరో కాదు అప్పుల వాళ్లు. వున్నది కాస్తా బాకీలు తీర్చేస్తే పిల్ల చేతికి ఏమొస్తుంది చివరికి? అన్యాయంగా ఆ పిల్లని నట్టేట ముంచేస్తున్నారు తల్లితండ్రులు. తాగేందుకూ, తినేందుకూ డబ్బుని మంచినీళ్లకన్నా అధ్వాన్నంగా ఖర్చుపెట్టేసి యిప్పుడు కాళ్లు చాపుకుని కూర్చుంటే కాలం గడిచేదెలా? పిల్ల పెళ్లి అయేదెలా? ఎప్పుడో దయారామ్ తనని వదిలి దేశాలు పట్టి పోయినప్పట్నుంచి కోరికలూ ఆశలూ ఏమీ తెలియకుండా నిమ్మకు నీరెత్తినట్లు బతికింది తను. ఇప్పుడీ పిల్లకి ప్రేమించడం కూడా చేతకాదు ఎలా బతుకుతుందో ఏమో. 'కరుణా' దర్శన్ కేక విని వచ్చింది కరుణ.

'ఎక్కడికి వెళ్లావు?'

'డాడీని లేపేందుకు.'

'లేచారా?'

'తలుపులు లోపల వేసుకున్నారు. ఎంతకి తెరవడంలేదు దర్శన్.'

'కొంపమునిగి పోయింది' దర్శన్ గుండె బాదుకోవడం మొదలు పెట్టింది. ఆమె ఎప్పటినుంచో అనుమానిస్తూనే వుంది.

'ఏమైంది?' కరుణ ఖంగారుగా అంది.

'కీర్తీ, యిటురా నాయనా' దర్శన్ డాబామీద నుంచి పక్కింటి కుర్రాడిని పిలిచింది. కీర్తి ఆ డాబా మీద నుంచి ఈ డాబా మీదకి ఒక్కగెంతు వేశాడు. పద్నాలుగేళ్ల కీర్తి 'డోగిరీ భాష'లో దర్శన్‌ని ఏమైంది? అని అడిగాడు. దర్శన్ ఏడుస్తూనే భార్గవ గదివైపు చూపించింది.

కీర్తి తలుపులకి ఆధారంగా వున్న గొళ్లాలని ఆధారం చేసుకుని 'వెంటిలేటర్' లోంచి నెమ్మదిగా తొంగి చూశాడు. అతను ఆ వెంటనే గట్టిగా కేక పెట్టాడు 'దర్శన్' అని.

దర్శన్ 'ఆఁ' అంది ప్రయత్నం చేస్తూ.

భార్గవ నేలమీద ప్రాణం లేకుండా పడి వున్నాడు. అతను పోయాడని తెలుసుకునేందుకు ఎంతో సేపు పట్టలేదు. కీర్తి తలుపులు తన్ని చివరకు గొళ్లెం వూడగొట్టగలిగాడు.

గదిమధ్య నిర్జీవంగా వున్న భార్గవని చూడగానే కరుణ జ్ఞానేంద్రియాలు క్షణం పని చేయడం మానేశాయి. ఐదునిమిషాల తరువాతగానీ ఆ పిల్ల తెలుసుకోలేకపోయింది తండ్రిపోయాడని. దర్శన్ శవానికి కొంచెందూరంలో కూర్చుని భోరున ఏడుస్తోంది. కరుణ తండ్రిపక్కనే కూర్చుని అతని శరీరంమీద చేయివేసి ఏడవసాగింది. కరుణ ఏడుస్తూంటే కీర్తి ఆమె భుజం మీద చేయివేసి మౌనంగా వుండిపోయాడు. కీర్తికి కర్తవ్యం బోధపడేందుకు మరో ఐదు నిమిషాలు పట్టింది. 'నేను యిప్పుడే వస్తాను. అందరికీ చెప్పాలి ఈ సంగతి' అతను పరుగుపెడుతూ గేటు తెరుచుకుని బయటికి వచ్చేశాడు.

అరగంటా, గంటా గడిచేసరికి యిది వరకు స్నేహితులం అని చెప్పుకున్న ప్రతి ఒక్కరూ ఆ యింటి ముందు చిన్నా పెద్దా భేదం లేకుండా హాజరయారు. అతను



# గవర్నెస్ కరుణ

ఆత్మహత్య చేసుకున్న సంగతి గాంధీనగర్ మొత్తం నిమిషాలమీద వ్యాపించింది.

చాలా కష్టంమీద పోస్టుమార్టమ్‌నుంచి తప్పించగల్గారు. శవదహనం అయి యింటికి వచ్చేసరికి చీకటి పడింది. ఆ రాత్రి దర్శన్ గానీ, కరుణగానీ భోజనం చేయలేదు. కరుణకి తోడుగా ఎవరూ వుండలేదు. రాత్రి పది గంటలవరకూ పరామర్శలయాయి.

భర్తపోయిన ఆ యిల్లు స్మశానం కన్నా కళావిహీనంగా వుంది. కరుణ మంచం మీద కూర్చుని అలవాటు ప్రకారం సిటీ వైపు చూసింది. రంగురంగుల బల్బులతో సిటీ గాంధీనగర్ దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. వెలగనిది కరుణ యిల్లు మాత్రమే.

ఏదో రాత్రి ఏదో యామంలో నిద్రపోయింది కరుణ. ఈ సంగతి మేనత్త కాశికి వుత్తరం రాసింది. పది రోజులు అతి సాధారణంగా గడిచిపోయాయి. రోజూ కాశి జవాబుకోసం ఎదురు చూసి చూసి విసిగి పోయేది కరుణ. పోస్ట్‌మాన్ 'సహీ బహన్ జీ' అనగానే వేడిగా నిట్టూర్పు వచ్చేది.

వున్నట్టుండి ఒకరోజు ప్రొద్దున్నే అపరిచితులు నలుగురైదుగురు వచ్చి కరుణకి తమ దగ్గర వున్న ప్రోనోట్లు యిల్లు అమ్మిన డాక్యుమెంట్లు, బాంక్ చెక్‌లు చూపించగానే కరుణ నిలువునా నీరై పోయింది.

దర్శన్ ఆమె పక్కనే వుండి పడిపోకుండా పట్టుకుంది. కరుణ మొహం మీద నీళ్లు చల్లి మంచినీళ్లు యిచ్చాడు కీర్తి. కీర్తికి ఆ యింటికి రావలసిన అవసరం ఎప్పుడూ కలగలేదు. ఇరుగు పొరుగులన్న తరువాత కరుణకి సహాయం చేయాల్సి వుంటుందని తోచి కీర్తి తనంతట తాను వచ్చాడు.

కరుణ లేచి కూర్చుంది. యింత చిన్న విషయానికే తను పడిపోయినందుకు సిగ్గుపడింది. 'చెప్పండి' అంది తేరుకుని.

సేట్ సోమనాథ్‌లాల్ అన్నాడు : 'మేము ముగ్గురం ఆయనకి యిచ్చిన అప్పుకి యిల్లూ, బాంక్ బాలన్సూ అన్నీ మాకు

ధర్మపథం

# త్రిమూర్తులు అనసూయ పుత్రులెలా అయినారు?

మహా పతివ్రత అయిన కౌశికుని భార్య, కుష్ఠురోగియైన భర్త కోరికపయి అతణ్ణి రాత్రివేళ ఒక వేశ్యయింటికి— తన భుజాలపై ఎక్కించుకుని తీసుకుని వెళుతున్నది. దారిలో ఒకచోట—దొంగ అనే అనుమానంతో మాండవ్యముని కొరత వెయ్యబడి ఉన్నాడు. గాఢాంధకారంలో పోతూ ఉండడం వల కౌశికుని భార్యకు అతడు కానరావడం లేదు. కౌశికుడి పాదం మాండవ్యునికి తగిలింది ఆ ముని కోపించి సూర్యోదయం కాగానే మరణించేటట్లు కౌశికుడిని శపించాడు. ఆ పతివ్రత— సూర్యోదయం కాకూడదని చెప్పడంవల్ల, ఆమె మహత్తువల సూర్యోదయం కానేలేదు.

సూర్యుడుదయించనందున కాల విభాగం తెలియనేలేదు. ఎప్పుడూ రాత్రిగానే ఉండినది. అందువల్ల రాత్రిందివ విభాగం, మాస, అయన విభాగం లేకపోయింది. స్నాన, జప, హోమాదులు, ప్రజల నిత్యకృత్యాలు నిలిచి పోయాయి. దేవతలు సంక్షోభపడి బ్రహ్మదేవునితో మొర పెట్టుకున్నారు. బ్రహ్మ విషయాన్నంతటినీ గ్రహించి “ఒక పతివ్రత ప్రభావం వల్లయిలా జరిగింది. ఆమెను సముదాయించి, సూర్యోదయం అయ్యేటట్లు చెయ్యడానికి అటువంటి గొప్ప పతివ్రతయే కావాలి. మీరు అత్రిమహర్షి భార్య అనసూయను ప్రార్థించండి. ఆమె వల్లనే యీ పని జరగగలదు” అని చెప్పాడు.

దేవతలు అనసూయాదేవి వద్దకు వెళ్ళి ప్రార్థించారు. ఆమె “సరే” అని చెప్పి కౌశికుని గృహానికి వెళ్ళి కౌశికుని భార్యను కలుసుకొన్నది. ఆమె పాతివ్రత్యాన్ని పలు విధాలుగా ప్రశంసించి, పతి సేవకు ఇంకా ప్రోత్సహించినది. అనసూయ ప్రోత్సాహానికి ఆమె పరమానందభరితురాలై, వచ్చిన పని యేమో చెప్పగోరినది. ఆమె లోక పరిస్థితిని వివరించి, సూర్యోదయ మయేటట్లు చేసి లోకాలను ఉద్ధరించాలని ప్రార్థించినది. “సూర్యోదయమైతే నా భర్త మరణిస్తాడు గదా!” అని ఆ పతివ్రత అన్నది. తన పాతివ్రత్య ప్రభావంవల్ల తా నతనిని బ్రతికించగలననీ, అతడు కుష్ఠురోగం లేకుండా యువకుడుగా ఉండేటట్లు చెయ్యగలననీ అనసూయ చెప్పి, ఆమెను సమ్మతింపజేసింది. తాను అనిన మాటను నెరవేర్చుకొంది. అందరికీ ఎంతో సంతృప్తి కలిగింది.

దేవతలు అనసూయను ప్రశంసిస్తూ వరం కోరుకోమన్నారు— త్రిమూర్తులు తనకు పుత్రులుగా కావాలని ఆమె కోరింది. త్రిమూర్తులున్నూ దానికి సమ్మతించారు.

బ్రహ్మ రజోగుణ ప్రధానుడైన చంద్రుడుగా ఆమెకు పుత్రుడై పుట్టాడు. అతడు ఓషధులకు రాజై, చల్లని తేజస్సుతో ప్రజల కెంతో ఆనందం కలిగించాడు. విష్ణువు సత్త్వగుణ ప్రధానుడైన దత్తాత్రేయుడుగా ఉద్భవించి దేవతలకూ, మానవులకూ మేలు కలిగించాడు! మహేశ్వరుడు తమోగుణ ప్రధానుడైన దుర్వాస మహామునిగా పుట్టి దుష్టుల నందరిని శిక్షించాడు.

“ఆత్మావై పుత్ర నామాసి” అని ప్రసిద్ధి. వీరు ముగ్గురూ త్రిమూర్తుల అంశాలవల్ల జన్మించినందున త్రిమూర్తులే అని చెప్పాలి. ఈ విధంగా అనసూయాదేవి సంకల్పం నెరవేరింది.

—బులుసు వేంకట రమణయ్య

---

చెందుతున్నాయి. వారం పదిరోజులు ఆగి యిల్లు స్వాధీనంచేసుకోమని మాతో ఆయన అన్నారు.

'మేము ఎందుకో అనుకున్నాం కానీ యిలా జరుగుతుందనుకోలేదు.'

కరుణ జాలిగా చూసింది. 'నాకంటూ ఏమీలేదా.'

రామ్‌లాల్ తల ఎత్తి 'క్షమించమ్మా నీకోసం అంటూ మిగల్చడం కాదు మా బాకీలే మాకు తీరలేదు' అన్నాడు.

'డాడీపోయి పదిరోజులైంది. యింకొక పదిరోజులు గడువు యిస్తే మేము వెళ్ళిపోతాం' అంది.

'అలాగే' అని వెళ్ళిపోయారు.

కరుణ కంచం ముందు కూర్చుంది కానీ అన్నం సహించలేదు. కంచంలో చేయి కడుకుని బయటికి వచ్చింది. ఈగలు తెగ ముసురుతున్నాయి. ఎండ తీక్షణతకి స్నానం చేసినట్లుంది శరీరమంతా. ఫాన్ గాలి వెచ్చగా వస్తోంది. మనసులో తాపం కళ్ళల్లోంచి ఆవిర్లుగా బయటికి వస్తోంది. కళ్ళు ఎరుపురంగుకి మారిపోయాయి. ఏం చేయాలి ? ఈ ఆలోచన మెదడును దొలిచివేస్తోంది. 'పోస్ట్'. కరుణకి ప్రాణం లేచివచ్చినట్లు అయింది. ఆ ఉత్తరం ఎక్కడిదో వెంటనే ఊహించ గల్గింది.

చి. కరుణకి

ఆశీర్వదించి వ్రాయునది. నువ్వు బయలు దేరి వచ్చేసేయి. మిగిలిన విషయాలు యిక్కడ ఆలోచించుకోవచ్చును.

— ప్రసాద్ మావయ్య.

కరుణకి ఎగిరి గంతు వేయాలనిపించింది. నడి సముద్రంలో కొట్టుకుపోతున్న వాడికి గడ్డిపోచ అందినట్లయింది! 'దర్శన్' కేక వేయాలనుకుని వెంటనే విరమించుకుంది. ఇప్పుడు దర్శన్‌ని ఏం చేయాలి? కొడుకు దగ్గరకి వెళ్ళి పొమ్మని చెబితే కృతఘ్నురాలు అనుకోదూ. దర్శన్‌ని తీసుకు వెడితే వాళ్ళే మనుకుంటారు? తనకు దారిలేదు దర్శన్ ఎలా?

కరుణ దృఢ నిశ్చయానికి వచ్చేస్తూ 'దర్శన్' అని కేక పెట్టింది. దర్శన్ వచ్చి 'ఏమ్మా' అని అడిగింది.

'బట్టలూ, సామానూ అన్నీ సర్దేయి. మనం బండార్కంక వెళ్ళిపోతున్నాం. మావయ్య రమ్మని రాశారు.'

'నేను కూడా నీతో రానా' దర్శన్ అనుమానంగా అడిగింది. కరుణ తలెత్తి చూసి

'నీ యిష్టం రావాలని వుంటే రా. లేదంటే మానేయ్' అంది.

'నువ్వు వద్దన్నా నేను వస్తాను. వాళ్ళు నన్ను పోషించలేక పోతే వాళ్ళింట్లోనే పని పని చేసి నీ కోసం వుంటాను. ఆడపిల్ల ఒంటరిగా వుండడం అంత మంచిది కాదు.'

'దర్శన్' కరుణ గొంతు ఆశ్చర్యంతో కృతజ్ఞతతో వొణికింది. దర్శన్ ఆ పిల్లని దగ్గరకి తీసుకుని కంట తడి పెట్టింది.

రెండు రోజుల్లో వున్న కొద్ది సామాను సర్దడం పూర్తయింది. ఖరీదైన ఫర్నిచర్ కూడా అప్పుక్రింద జమ అయి పోయింది.

కరుణ అనుకున్న సమయానికన్నా ముందే యింటినీ, బాధ్యతల్నీ అప్పులవాళ్ళ పరం చేసి మిలిట్రీ ట్రంక్ బెడ్డింగ్‌తో, దర్శన్‌తో పఠాన్‌కోట్ బయలుదేరింది.

ఋణం తీరిన ప్రదేశం కనుమరుగు కాగానే కళ్ళల్లో నీళ్ళు కూడా కరువు అయ్యాయి.

మూడవ రోజు ప్రొద్దున్నే బండా ర్లంకలో కాలు పెట్టింది. తను వస్తున్నట్లు టెలిగ్రాం ఢిల్లీ నుంచి యిచ్చింది. వాకిట్లో పిల్లలందరూ వరుసగా నిలుచుని వున్నారు. బస్సు ఆగింది. ముందు కరుణ బెడ్డింగ్ క్రిందపడేసి ట్రంక్‌తో దిగగానే దర్శన్ ఆమె వెనుక దిగింది.

ముసలమ్మ చివరో దిగగానే పిల్లలు మొహాలు చూసుకున్నారు. కాళి లోపల్నించి వచ్చి మేనకోడల్ని కౌగలించుకుని కంట తడి పెట్టింది. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు దుర్గా, భవానీ చీరలు కడుతున్నారు. మిగిలిన పిల్లలందరూ బాండ్ మేళం కట్టి నట్లు ఒకేరంగు పరికిణీలు ఓణీలు వేసు కున్నారు.

స్నానం అయ్యాక దర్శన్‌కీ, కరుణకి భోజనం పెట్టింది. దర్శన్ అన్నం తిన్నానని పించుకుని బయట పడింది. ఇన్నేళ్ళల్లో ఆమె ఎప్పుడూ అన్నం తిని ఎరగదు. ఎప్పు డైనా పిడికెడు మెతుకులు నోట్లో వేసు కున్నా రెండు పుల్కాల్తో, రొట్టెల్తో తినేది. ఈ కొత్తరకం వంటలు కళ్ళల్లో నీళ్ళు తెప్పిస్తున్నాయి. దర్శన్ అన్నం మింగినట్టే యీ దుఃఖాన్ని కష్టాన్ని మింగింది.

రెండు స్వీట్లు, రెండు హాట్లు, చెప్ప

# గవర్నెస్ కరుణ

చెప్పని భేల్, చాయ్ యివి తిన్నప్పుడు డాక్టర్ యింటి మనిషై, యిప్పుడు చెట్టుకు పిట్టగా ఎగిరిపోతే దిక్కులేని కరుణకోసం యివన్నీ దిగమింగి తీరాలని పించింది. దర్శన్ పంజాబీ బట్టలు చూసి పల్లెటూరు కావడంవల్ల ముస్లిముల మనిషని తేల్చిపారేశారు. ఎప్పుడూ లేని అలవాటు యిప్పుడెలా వస్తుంది? 'సింధూర్ పెట్టుకో దర్శన్' అంది కరుణ.

బద్ధకంగా వూరుకుంది దర్శన్. కరుణ లిప్‌స్టిక్, సింధూర్, అద్దం తీసుకు వచ్చి యిచ్చి 'పెట్టుకో' అని గద్దించింది.

తీర్చిదిద్ది సింధూర్, లిప్‌స్టిక్ పెట్టు కున్నాక 'అదా సంగతి' అని వూరుకున్నారు.

## చంద్ర గ్రహపరిశోధనకు కొత్త సాధనం

చంద్ర గ్రహ గమన వేగంలో వచ్చే మార్పులను ఖచ్చితంగా కొలవడానికి వీలయిన నూతన పరికరం రూపొందించ బడింది. ఈ సాధనం, సెకండులోని వెయ్యో వంతు కొకసారి చంద్రుని వెనుకగా పయనించే తారల నుండి వెలుగు కొలమా నాలను గ్రహించి చంద్ర గ్రహ గమన వేగాన్ని కొలుస్తుంది.

లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో రూపొం దించబడిన యీ పరికరం జంట నక్షత్రాలను సైతం పరిశోధించగలదు.

అంట్లు పిల్లలే తోముతారు. కరుణ రోజూ తనూ తోముతానని వెళ్ళేది. కాళీ, పిల్లలూ చేతులు అడ్డంపెట్టి కరుణని రానిచ్చేవారు కాదు. రిజల్ట్సు వచ్చాయి. బి. ఏ. హైయర్ సెకెండ్ క్లాసులో పాసైంది కరుణ. కీర్తి టెలిగ్రాం యిచ్చాడు. ఏపనీ చేయకుండా తిని కూర్చో వాలంటే దర్శన్‌కీ, కరుణకీ సిగ్గుగా వుంది. వుద్యోగ ప్రయత్నం మీద దృష్టి పడింది కరుణకి. అప్లికేషన్లు పెట్టి పెట్టి విసిగి పోయింది. ఏ కంపెనీగానీ, ఆఫీసుగానీ కనీసం కాల్ లెటర్ పంపడం లేదు. తండ్రి తన పేర వేసిన వేయి రూపాయలూ క్రమంగా ఏడు వందలకి వచ్చాయి. వంటి మీద పది తులాల బంగారం మాత్రం వుంది. కూర్చుని తింటే కొండలూ, రాళ్ళూ కరిగి పోతాయి. ఈ బంగారం, డబ్బూ ఎంత కాలం వస్తుంది? అప్లై చేసిన కొన్ని కంపెనీల నుంచి రిగ్రెట్ లెటర్స్ వచ్చాయి.

కాళీ, పిల్లలూ, ప్రసాద్ యింత క్రితం తండ్రితో వచ్చినప్పుడు ఎలా చూశారో యిప్పుడూ అలాగే చూస్తున్నారు. అయినా ఏదో భయం. తండ్రి వున్నప్పుడు మనసా వాచా ఆత్మనా అత్త అనిపించిన ఆమె యిప్పుడు ఏదో దూరపు బంధువే అనికూడా అనిపిస్తోంది. రాత్రీ పగలూ ఎడతెరిపి విరామం లేకుండా పక్షులు కొడుతున్నాయి. కరుణ అరుగుమీద కూర్చుని ఆలోచిస్తోంది. 'పగలూ–రాత్రీ రైలు పట్టాలుగా కాలం రైలుగా చేసుకుని వెళ్తాను మళ్ళీ వస్తా' అంటుందని చదివిన మాటలు చీటికీ మాటికీ గుర్తు వస్తున్నాయి.

ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న ప్రసాద్ ఏమీ కూడబెట్టలేదు. పిల్లలు అంత కంతకు ఎదిగిపోతున్నారు. వీళ్ళ పెళ్ళి ఎలాచేయాలో అని భార్యా భర్త యిద్దరూ అనుకోరు. అతను తెచ్చిన డబ్బు చేతిలో పోస్తాడు. ఆమె వండి వార్చి పెడుతుంది. బిడియ పడుతూ రెండు మూడు సార్లు తన డబ్బు యివ్వబోయింది. కానీ కాళి తీసుకోలేదు. 'అన్నయ్య పోతే నువ్వు పరాయిదానివై పోలేదు కరుణా. ఇంకా మేము విశ్వాసం లేని వాళ్ళం కాలేదు.'

ఆ తరువాత కాళికి కరుణ డబ్బు యివ్వ లేదు. పిల్లల్ని సినిమాకి తీసుకువెళ్ళాలి అని పించినా వున్న డబ్బు ఖర్చుపెడితే ఎలా అని మానేసింది.

రవి సెలవలకి యింటికి వచ్చాడు. కరుణని చూపించి 'మీ మావయ్య కూతురు' అని పరిచయం చేశాడు ప్రసాద్. దర్శన్ ఆ పిల్లవాడి వైపు ఆశగా రెండు నిమిషాలు చూసింది. ఆ తరువాత భయంతో నోరు మూసుకుంది. మధ్యాహ్నం కరుణ నిద్ర పోయినప్పుడు ఆడవాళ్ళందరూ చేరి చెప్పు కునే మాటలు దర్శన్‌కి అర్థం కాకపోయినా నెమ్మదిగా అనుకునే ఆమాటలు కరుణకి సంబంధించినవేనని అనుమానిస్తోంది. రవి మీద లేనిపోని ఆశలు పెట్టుకోవడం అంత మంచిపని కాదని మౌనంగా వుండి పోయింది.

(ఇంకా వుంది)

# హైదరాబాదు నోట్‌బుక్

**బాలబంధు బిరుద ప్రదానం :-**

బాలసాహిత్యంలో విశేషకృషిచేసి, బాల బాలికల శ్రేయస్సుకోసం జీవితాన్ని పణంగా ఒడ్డి అరుగురు ప్రముఖులను రాష్ట్రబాలల అకాడెమి నవంబర్ 19వ తేదీన "బాలబంధు" బిరుదంతోను బాలలఅకాడెమి విశిష్టసభ్యత్వంతోను సన్మానించింది. సన్మానితులు-శ్రీయుతులు న్యాయపతి రాఘవరావు, పాలంకి వెంకటరామచంద్రమూర్తి, బి.వి నరసింహారావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, డాక్టర్ వి. తిరుమలరావు. ఈ సన్మానసభ జవహర్ బాల భవన్‌లోని ఇందిరాప్రియదర్శిని హాలులో జరిగింది. బాలల అకాడెమి అధ్యక్షులు శ్రీ తిరువరంగం హయగ్రీవాచారి అధ్యక్షత వహించారు. బాల బాలికల కోసం ప్రభుత్వం చేస్తున్న కృషిని ఆయన వివరించారు. ప్రారంభంలో అకాడెమి కార్యదర్శి శ్రీ తిరుమల రామచంద్ర స్వాగతం చెబుతూ అంతర్జాతీయ బాల సంవత్సరంలో అకాడెమి తలపెట్టిన కార్యక్రమం-బాలవిజ్ఞాన సర్వస్వం రచన, ఇందిరా పార్కులో బాల ప్రపంచ నిర్మాణం, వివిధ విషయాలపై వంద పుస్తకాల నిర్మాణం, మున్నగుదానిని వివరించారు. ముఖ్య అతిథిగా విచ్చేసి, బాలబంధువులను సన్మానించిన రాష్ట్ర గవర్నర్ శ్రీ కె.సి. అబ్రహాం ప్రసంగిస్తూ, పిల్లలలో శాస్త్రీయదృక్పథం అలవరచి, మూఢవిశ్వాసాలను తొలగింపజేయాలన్నారు. పిదప గవర్నర్ అరుగురికి మొమెంటోలు, వారికృషిని వివరించే సన్మానపత్రాలు, అర్థ వేయిన్నూటపదారు రూపాయల చెక్కులు వెల్వెట్ సంచిలో, చందనతాంబూలాలతో అందజేశారు. సన్మానితుల సమాధానం చెప్పిన తర్వాత ఇండియన్ నేషనల్ థియేటర్ బాల విభాగం వారు అవనిజ నృత్యనాటకం ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందింపచేశారు. బాలల అకాడెమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బుద్ధిగ సుబ్బరాయన్ వందన సమర్పణంతో సన్మానోత్సవ కార్యక్రమం సమాప్తమయింది. శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి సన్మానసభకు రాలేకపోయారు. ప్రారంభంలో అకాడెమి కార్యవర్గ సభ్యులు శ్రీ ముద్దిపట్ల వేంకటరావు సన్మాన్యులను సభకు పరిచయం చేశారు.

**వేలూరి సహజానంద కాలధర్మం :-**

ప్రముఖ రచయిత, అరవిందదర్శన విద్వాంసుడు, ఆకాశవాణిలో భగవద్గీత ప్రవచనం ద్వారా ప్రజలను ప్రభావితంచేసినవాడు అయిన శ్రీ వేలూరి సహజానంద నవంబర్ 10వ తేదీ సాయంకాలం గుండెపోటుతో హఠాత్తుగా కన్నుమూశారు. ఆయనవయస్సు 58 సంవత్సరాలు. సహజానంద 17 సంవత్సరాలుగా ఆకాశవాణిలో పని చేస్తున్నారు. అంతకుముందు సమాచారశాఖలోను, ఆంధ్రపత్రిక, మాతృభూమి పత్రికలలో పని చేశారు. సోదరుడు సదానందతో కలిసి "సమత" అనే మాసపత్రిక నడిపారు. భగవద్గీతకు చక్కని వ్యాఖ్య వ్రాసి, పండితుల మన్ననలు పొందారు. నిరుడు తెలుగు నాట సంభవించిన తుఫాను బీభత్సంపై ఆయన వ్రాసిన "అశ్రుఘోష" తుఫాను నాటికకు కేంద్ర బహుమతి లభించింది. ఆయనకు భార్య, ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలూ వున్నారు. నగరంలోని పెక్కు సాహిత్య సంస్థలు ఆయనకు నివాళులర్పించాయి. శ్రీ వివాస సాహితీ సమితి శ్రీ కె.సి. భాస్కరరావు అధ్యక్షతన జరిపిన సమావేశంలో శ్రీయుతులు గోపాల చక్రవర్తి, కళాప్రపూర్ణ రావూరి వేంకట సత్యనారాయణరావు, పి.ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి, కేంద్రహైదరాబాద్ విశ్వవిద్యాలయం తెలుగు

అబ్బబ్బబ్బ! ఇంద్రజాలికుణ్ణి
పెళ్ళి చేసుకోవటం
బుద్ధి పొరపాటయి
పోయింది !!

శ్రీవాస్

# హైదరాబాద్ నోట్ బుక్

ప్రొఫెసర్ డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, డి. వెంకటరామయ్య, డాక్టర్ ఎస్. వి. రామారావు, డాక్టర్ వాసా ప్రభావతీశాస్త్రి మున్నగువారు. సహజానంద అనువాద పాటవాన్ని. రచనా రామణీయకాన్ని. పనిలో శ్రద్ధను. వివరించారు. ఆయన ఆకాశవాణిలో సూక్తి ముక్తావళి ద్వారా భగవద్గీతా ప్రవచనాన్ని జరిపి లక్షలాది ప్రజలలో ఆధ్యాత్మిక చింతనను ఉద్దీప్తం చేశారని అధ్యక్షుడు శ్రీ కె.వి. భాస్కరరావు అన్నారు. సహజానంద కుమారులు చంద్రశేఖర్, శరత్ మాట్లాడుతూ తమతో ఆయన మిత్రుడుగా, మార్గదర్శిగా వ్యవహరించారన్నారు.

మేవా ఎగుమతి :—

చాలకాలం నిలువవుండడానికి పళ్ళలోని నీటి భాగాన్ని తొలగించి మేవాగా తయారుచేయడం అనాదిగావుంది. ముఖ్యంగా ద్రాక్షను కిస్‌మిస్‌గా మేవా చేసి నిలువ చేసుకోడం, మామిడిఒరుగు ఆంధ్ర సంగతి అందరికీ తెలిసిందే. ఈ మేవా తెలుగుదేశంనుంచి విదేశాలకు ఎగుమతి కావడం చాల తక్కువ. దీనికోసం రాష్ట్ర వ్యవసాయాధార పరిశ్రమ సంస్థ ప్రయత్నిస్తున్నట్లు సంస్థ అధ్యక్షులు శ్రీ కె. అప్పారావు నవంబర్ 10న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు. మేవాలకు. ఎండు కూరగాయలకు విదేశాలలో ఎక్కువ గిరాకీ ఉన్నదని ప్రాన్సుకు లక్షన్నర రూపాయల మేవా ఎగుమతి అయిందని ఆయన తెలిపారు.

యుద్ధక్రీడా ప్రదర్శనం :—

విజ్ఞాన శాస్త్రం అభివృద్ధిచెందిన కొద్దీ యుద్ధ ప్రక్రియలోనూ మార్పువచ్చింది. ఆ మార్పును ప్రజలకు తెలిపి, వారిలో రక్షణ క్రియలపట్ల శ్రద్ధను సైనికులపట్ల గౌరవాన్ని పెంపొందించడానికి 30 సంవత్సరాల తర్వాత లాల్‌బహదూర్ స్టేడియంలో నవంబర్ 17,18 19 తేదీలలో యుద్ధక్రీడల ప్రదర్శనం జరిగింది. స్టేడియం జనంతో క్రిక్కిరిసిపోయింది. యుద్ధరంగం కళ్ళకు కట్టినట్లయింది. మోటారు సైకిళ్ళ విన్యాసాలు, జీపుల విన్యాసాలు ప్రేక్షకుల గుండెలు ఆగిపోయేట్లు చేశాయి. ఈ ప్రదర్శనవల్ల వచ్చిన ఆదాయాన్ని సైనిక కుటుంబాలకు, మృతవీరుల కుటుంబాలకు వినియోగిస్తారు. మొదటిరోజు గవర్నర్ అబ్రహాం ముఖ్య అతిథిగా విచ్చేశారు.

ప్రత్యేకతెలంగాణాకు పోరాటం :—

ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ వైస్ ఛాన్సలర్ డాక్టర్ రావాడ సత్యనారాయణ అధ్యక్షతన నవంబర్ 10వ తేదీన వివేకవర్ధినీ కళాశాల ఆవరణలో జరిగిన సమావేశంలో శాంతియుతంగా తెలంగాణా రాష్ట్రస్థాపనకు పోరాటం జరుపాలని తీర్మానించారు. తెలంగాణా పోరాట సమితి అధ్యక్షుడు శ్రీ ఎం. జగన్మోహన్ రెడ్డి, మాజీ శాసన సభ్యుడు శ్రీ కె. రంగదాసు, శ్రీమతి టి. శాంతాబాయి, శ్రీయుతులు ఇ.వి. పద్మనాభం, ఎం. కిషన్‌రావు, బి. కిషన్‌లాల్, టి. ఎం. అంజయ్య, శంకరరావు మున్నగువారు ప్రసంగించారు.

ఉపశ్రుతి :—

"ఈరోజుల్లో నవలా రచన కుటీరపరిశ్రమగా పరిణమించిందని శ్రీమతి లతగారు అంటున్నారే. నిజమేనాండీ?" అనడిగాడు ఒక జిజ్ఞాసువు నన్ను. ఏమి జవాబు చెబుదామా—అని ఆలోచిస్తున్నాను. ఇంతలో పక్కనవున్న ఒక యువరచయిత "రచయితలు సాధారణంగా బీదవారు—వినిమా రచయితలు, మరికొందరు తప్ప. అలాటి వారు కుటీరవాసులుకాక మరేమవుతారు? మరి వారు చేసే రచనలు కుటీరపరిశ్రమకాక మరేమిటి ?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

— తిరుమల రామచంద్ర

# అతిసర్వత్ర వర్జయేత్

తోళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ శర్మ

మురళీమోహన్‌గారు నా స్నేహితుడు. స్నేహితుల్లో చాలా రకాలుంటారు. 'హల్లో' అనే పలకరింపుతో సరిపెట్టబడే వాళ్ళు కొందరు; రోడ్డు మీద కనిపించినప్పుడలా మాట్లాడి వెళినా వాళ్ళు వెళ్ళిన తర్వాత 'యితగాడి పేరేమిటి చెప్మా' అని యెంత ఆలోచించినా గుర్తుకురాని వాళ్ళు కొందరు; రోడ్డు మీద కనిపించినప్పుడల్లా పిలుంటే అక్కడ మాత్రమే కబుర్లు చెప్పే వాళ్ళు కొందరు; అటూ మాటాడిం తర్వాత్తో అంతకు ముందో 'రండి యింటికి పోయి కాస్త కాఫీ ధారకం పోసుకుని మాట్లాడుకుందాం' అని యింటిమీదొచ్చి పడేవాళు కొందరు...యిలా యెంతమందో. కానీ మురళీమోహన్‌గారు మాత్రం ఇలాంటి కోవకు చెందని వారు. రోడ్డు కవతలివైపు నుంచి వెడుతున్నా 'ఏవండోయ్!' అని కేక వేసి మధ్యలో వెళ్ళే వాహనాల రద్దీ తగ్గే వరకూ ఆటాయన. యిటు నేను నిలబడి ఆ తర్వాత ఆయనవైపు నేను వెళ్ళడమో నా వైపు ఆయన రావటమో జరిగి ఒక అర గంటకు మించకుండా మాట్లాడి వెళ్ళటం జరుగుతుంది. చాలాసార్లు ఆయనే నేను వున్నవైపు రావటం జరుగుతుంది. సామాన్యంగా వారానికి నాలుగైదుసార్లు కలుసుకుంటూ వుంటాం. అయినా యిన్నేళ్ళ నుంచి ఆయన యింటికి నేను వెళ్ళటంగానీ ఆయన నా యింటికి రావటంగానీ జరగలేదు.

ఇదంతా ఒక నెల క్రితం వరకూ జరుగుతూ వచ్చిన విషయం. ఈమధ్య మాత్రం ఆయన కనిపిస్తే నేనే తప్పించుకుంటూ పోతున్నాను; (ఆయనకు నేను కనిపించితే మాత్రం ఆయన వదిలి పెట్టటం లేదనుకోండి) కానీ నేనే—

'ఇంటో కుంపటి అంటించారు ఫలానా వస్తువు తొందరగా యింటికి చేర్చకపోతే కొంప లంటుకుంటయ్యండోయ్' అంటూ కలసిన మరు క్షణంలోనే ఆయన్ని వదిలించుకుంటున్నాను. ఇలా నేను మారిపోవటానికి కారణం బాబూరావు. బాబూరావు గురించి మీకు కాస్సేపట్లో చెపుతాను. అతన్ని గురించి చెప్పేముందు మురళీమోహన్‌గారి గురించి అంతకంటే ముందు నా గురించి మనవిచేస్తాను.

నేను ఎం. ఏ పేసయి మూడు సంవత్సరాలు నిరుద్యోగి గిరీ వెలగబెట్టి ఆవి వెళ్ళ

బట్టి కాబోలు పదేళ్ళ క్రితం ఎకౌంటెంట్ జనరల్ వారి కార్యాలయంలో అప్పర్ డివిజినల్ క్లర్క్‌గా వుద్యోగంవస్తే పంచభక్ష్య పరమాన్నాలు లభించినట్టు భావించి చేరిపోయాను. హైదరాబాదుకు అలా చేరిన రెండునెలలకు కాబోలు మురళీమోహన్‌గారు నాకుబజార్లో కలిశారు. వారితో యెవరిద్వారా పరిచయం అయిందో, ఆ సందర్భం ఏమిటో యిప్పుడు గుర్తుకు రావటంలేదు. కానీ పరస్పర పరిచయాలయిం తర్వాత ఆయన అన్న మాటలు యిప్పటికీ నా చెవుల్లోనే వున్నాయి.

'ఆహా... ఏ. జి ఆఫీసులో వన్నమాట మాంచి వుద్యోగం. మూడు నాలుగేళ్ళల్లో డెప్యూటీ ఎకౌంటెంటు జనరల్ అయిపోతారు. రెండువేలకి తక్కువ మాడరు మన తెలుగు వాళ్ళనిలా పెద్ద పదవులో చూస్తుంటే చాలా సంతోషం కలుగుతుందండీ... నాలాంటి వాళ్ళకి సహాయం ఆడిగే ఆసరా కూడా కనిపిస్తుంది' అన్నారాయన.

నాకు ఆకాశంలోకి యెగిరిపోతున్నట్లనిపించింది. నిజం చెప్పొద్దూ. యు. డి సి పోస్టుకు నేను సెలెక్టయినప్పుడు నేనట్లాగే అనుకున్నాను. చేరింది మాత్రం ఆ ఆశతో కాదనుకోండి. గత్యంతరం లేక చేరాను. అయినా యివన్నీ ఆయనో అనకుండా—

'ఆ ...అంతవరకూ వెళ్ళాలంటే గాడ్ ఫాదరెవడో వుండాలండీ!' అన్నాను. నిరుద్యోగిగా వున్న రోజుల్లో వుద్యోగం రానప్పుడల్లా నేనుపయోగించిన ఆయుధం యిదే; ఆ ఆయుధాన్ని మళ్ళీ పైకి తీశానప్పుడు.

'ఎందుకు రాదండీ? మీరు ఋదివింది ఎం. ఏ. ఎకనమిక్సు! ఆ డిగ్రీ అంటే మాటలా యేమిటి?' అన్నాడు.





ఆయన అట్లా అనటంతో నా డిగ్రీపట్ల నాకు గౌరవం పెరిగి, నాకు గర్వం కూడా కలిగింది. (అసలంతకు ముందే ఆ డిగ్రీ నాకు వుద్యోగం ప్రసాదించినరోజే దానిపట్ల నాకు గౌరవభావం కలిగిందనుకోండి) 'ఆ డిగ్రీ అంటే మాట్లాయేమిటి?' అని మురళీమోహన్ గారడటంతో అంతవరకూ అదే డిగ్రీతో వుద్యోగంరాక పడ్డ పాట్లు కూడా మర్చిపోయాను. అయినా కొంచెం మొహమాటంపడి—

'ఆఁ. యిదేమంత క్వాలిఫికేషనండీ' అన్నాను.

దాంతో ఆయన దేశంలో పెద్దవాళ్ళుగా వున్న వాళ్ళల్లో సగంమంది కున్నది యీ డిగ్రీనేనసీ, ఈ డిగ్రీతో పెద వాళ్ళయిన వాళ్ళ పేర్లు కొన్నిచెప్పారు. ఆ సమయంలో 'ఆ డిగ్రీ లేకపోయినా వాళ్ళు పెద్దవాళ్ళు గాకుండా వుండేవారా' అన్న అనుమానం నాకురాలేదు. నాకు ఆకాశంలో యెగురుతున్నట్లనిపించింది. నిరుద్యోగిగా వున్నప్పుడు నేను పుట్టిన తేదీనాడు యేయే గొప్పవాళ్ళు పుట్టారో చూసుకునేవాణ్ణి ధైర్యం తెచ్చుకునేందుకు. కానీ వాళ్ళ డిగ్రీలేమిటో తెల్సుకోలేదెప్పుడూ. మురళీమోహన్ గారి విషయం చెప్పటంతో నా డిగ్రీమీదా, తద్వారా నామీనా నాకు నమ్మకం పెరిగి పోయింది. ఆ రాత్రి యింటికి వెళ్ళాక నా డిగ్రీ సర్టిఫికెట్టుని యస్సెస్సెల్సీ రిజిస్టర్లోంచి తీసి చాలాసార్లు చూసుకున్నాను. ఆ డిగ్రీకి ఫ్రేము కట్టిద్దామన్న ఆలోచన కూడా వచ్చిందారాత్రి

## అతిసర్వత్ర వర్జయేత్

అంతవరకూ యెవరన్నా 'మీరేంచేశారు?' అని అడిగితే 'యు. డి. సి' అని మాత్రం చెప్పేవాణ్ణి. అదీగాక 'మీరేం చదివారు' అనేందుకు 'మీరేంచేశారు?' అని అడగటం నాకు క్రొత్త గూడాను — కానీ ఆరోజు నుంచి 'మీర్చేసే వుద్యోగం ఏమిటి'ని అడిగినా నా డిగ్రీయేమిటో చెప్పిగానీ నా వుద్యోగం సంగతి దగ్గరికి రావటంలేదునేను. ఇదంతా మురళీమోహన్‌గారి మహాత్మ్యమే.

నన్నంత గొప్పవాణ్ణి చేసిన మురళీమోహన్‌గారి కోసం ఆ మర్నాడు పని పెట్టుకుని బజారుమీద వెదికి ఆయన్ని హోటల్‌కి తీసుకెళ్ళి మరికొంతసేపు మాట్లాడాను. అట్లా అయ్యింది మా యిద్దరికీ స్నేహం. ఆయన అన్నట్లు మూడు నాలుగేళ్ళల్లోగాదు, యిప్పటిక్కూడా నేను డెప్యూటీ ఎకౌంటెంట్ జనరల్‌ని కాలేదు. ఆ పోస్టుకి తీసుకుని వెళ్ళే మెట్లల్లో వకటి మాత్రం తగ్గించొచ్చు—యీ మధ్యనే నేను సెక్షనాఫీసర్నయ్యాను. నాకు ప్రమోషన్ వచ్చిన రోజున ఆ విషయం మురళీమోహన్ గారితో చెబితే ఆయన చేసిన హడావిడి యింతా అంతాకాదు. 'ఇకనేం నువ్వుఆఫీసరువి; యేదోమినిస్ట్రీలో తప్పకుండా సెక్రటరీగా రిటయిరవుతావు' అన్నారు. మళ్ళీ నేను మామూలుగానే గగన విహారం చేసి మళ్ళీ అంతే మామూలుగా మొహమాటం చూపించాను కూడాను. కానీ యిక్కడ వక్క విషయం మాత్రం మనవి చేసుకోవాలి. నేను డిపార్ట్‌మెంటు పరీక్షలన్నీ శ్రద్ధ వహించి వాటిల్లో వుత్తీర్ణుడవటం వల్లనే యీ ప్రమోషనొచ్చింది; నేనా శ్రద్ధ వహించటానికి కారణం మురళీమోహన్‌గారే. ఆయనపట్ల కృతజ్ఞతా భావం ఎల్లప్పుడూ వుండాలని నిర్ణయించుకున్నానప్పుడు. ఆ భావమే యిప్పుడు నాలోంచి పోతోంది.

అంతగా నన్ను ఆకాశాని కెక్కించిన మురళీమోహన్‌గారేదో నిరుద్యోగి అని మీరనుకుంటే మీరు పొరపాటు పడ్డారనే చెప్పాలి. లేదా మీరు పొరబడేటట్లు నేను చెప్పయినా వుండాలి. రెండోదే నిజమయితే నన్ను క్షమించండి. మురళీమోహన్‌గార్ని మాత్రం తక్కువగా అంచనా కట్టకండి. అయినా ఆయన గురించి నాకు తెలిసిన విషయాలు చాలా తక్కువ. తన గురించి ఆయన నాతో ఏమీ చెప్పలేదనే చెప్పాలి. నేనా వివరాలు అడిగినా ఆయన ఒకటి రెండు ముక్కల్లో చెప్పేసి నా ఆఫీసు విషయాల వైపు సంభాషణ మళ్ళించేవారు. ఆ రెండు ముక్కల్లో నాకు తెల్సిందేమిటంటే— ఆయన ఒక నేషనల్ లేబొరేటరీలో సీనియర్ సైంటిఫిక్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నారని. ఆయన గురించి మరి కొంత తెల్సుకునేందుకు ప్రయత్నించినా ఆయన నాకా అవకాశం యివ్వలేదు. దాంతో ఆయన తనని గురించి నాకు చెప్పింది నిజమేనా అన్న అనుమాన మొచ్చింది. అందుకే ఆ పరిశోధనా సంస్థలో పని చేస్తున్న వాళ్ళని నలుగుర్ని కలిసి ఆయన భోగట్టా సేకరించాను. వాళ్ళు చెప్పింది విని ఆశ్చర్యపోయాను. ఆయన ఆ సంస్థలోని పరిశోధనా విభాగంలో బాగా పేరున్న శాస్త్రజ్ఞుడు. విదేశాలుతరచువెళ్ళి వస్తూంటాడు. ఇదంతా తెల్సుకుని నేను అవాక్కయినాను. వెంటనే యింటికి తిరిగి వస్తూ బజారుమీద మురళీమోహన్‌గారికోసం వెదికాను. ఆ సమయంలో ఆయన పబ్లిక్ గార్డెన్స్ వైపు వెళుతూ వుంటారు... ఆయన కనిపించారు మామూలుగానే రోడ్డుకు అవతలి వైపు. ఆయనే రోడ్డుదాటి యిటువైపుకు వస్తారని నేనే తొందరగా— కార్లవాళ్ళ విరసన తెలియకనే దృక్కుల్ని నిర్లక్ష్యంచేసి— రోడ్డుదాటి ఆయనను చేరుకున్నాను. కాఫీ హోటల్లో చాలాసేపు మాట్లాడాం. ఆరోజు ఆయన్ని బిల్లు చెల్లించనివ్వకుండా నేనే చెల్లించాను.



మన ఆఫీసులో ఇతనొక్కడే సార్ టెంపరరీ! అంచేత మక్కీ వేయలేదు!

# ఈయన వ్యయంచేయగల రు. 60 లతో ఒక ప్యాంటును కొనాలని స్వప్నం కంటున్నారు.

## ఏ మిల్లు యీయన స్వప్నాన్ని రూఢిపరచగలదు?

లక్ష్మీ. ఎందుకంటే పురుషుల అభిరుచులను లక్ష్మీ పరిపూర్ణంగా అర్థంచేసుకున్నది. ముదురు రంగులలోను, గాంభీర్యంగాను, చూపులకు సుందరంగాను ప్యాంట్లను ధరించాలని పురుషులు వాంఛించుతారు. (షర్టులకు సంబంధించినంత వరకూ ప్రశాంతమైన చల్లని రంగుల చేరికగల షర్టులనే ఆఫీసుకు, డిజైన్లుగల షర్టులను సంధ్యా సమయాలలో బయట విహరించుటకు పురుషులు ధరించాలని కోరుకుంటారని మాకు విదితం). అందువల్లనే ప్రత్యేకమైన ప్యాంటు గుడ్డలను లక్ష్మీ తయారుచేసి అందజేస్తోంది.

పాలీ క్రాన్ ప్యాంటు గుడ్డలు (మరియు గోల్డ్ క్రాన్ షర్టింగులు) పాలియెస్టర్ బ్లెండ్‌తో కూడినవి మీ మనస్సును రంజింపజేసే అనేకరకాల రంగులలో లభ్యంకాగలవు.

మరోపర్యాయం ప్యాంటుకు గుడ్డలు కొనే సందర్భంలో పాలి క్రాన్ రకాలను తప్పకుండా అడిగిచూడండి. లేకపోతే లక్ష్మీ షోరూముకు విచ్చేయండి.

మీ అభిరుచికి అనువైన వివిధరకాల బట్టలను లక్ష్మీ అందజేస్తోంది.









FDS LM 2608 TEL

అంతకు పూర్వం నేను బిల్లు చెల్లించి వచ్చేవాడు వుండే వుద్దేశ్యానికి యిప్పుడు బిల్లు చెల్లించటంలోగల వుద్దేశ్యానికీ చాలా తేడా వుంది. కాఫీ తాగేటప్పుడు కూడా కుర్చీలో వెనక్కి వాలి కూర్చోలేదు నేను. తర్వాత యింట్లోకి అడుగు పెడుతూనే—

'మురళీమోహన్‌గారంటే యేమిటనుకున్నావేమిటీ' అని నా భార్య నుద్దేశించి ప్రశ్నించాను.

అప్పట్నుంచీ ఆయనపట్ల నాకున్న గౌరవభావం అట్లా అట్లా పెరుగుతూ నాలో వ్రేళ్ళు పాతుకుపోయింది. సరిగ్గా అప్పుడే— అంటే యిప్పటికి ఆర్నెల్ల క్రితం నాకు బాబూరావుతో పరిచయం అయ్యింది. నా భార్య పుట్టింటికి వెళ్ళినప్పుడు నేను హోటల్ భోజనం చేసే రోజుల్లో బాబూరావు నాకు హోటల్లో కలిశాడు. ఒక న్నాళ్ళోజులు చిరునవ్వుతో పలకరించుకోవడం అయింతర్వాత మాటల్తో పలకరింపులూ, ఆ తర్వాత హోటల్ ముందున్న కిళ్ళీ షాపులో యిద్దరం తీసుకున్న కిళ్ళీలకు ఒకళ్ళమే డబ్బులివ్వడందాకా పెరిగి, నేను అతగాడి గదికి వెళ్ళటం అతను నాయింటికి రావటంవరకూ వచ్చింది.

బాబూరావేదో బ్యాంకులో గుమాస్తాగా వుంటున్నాడు. పట్టభద్రుడు. బి. కాం. చదివాడు. అవివాహితుడు. అతగాడికి వివాహం కాలేదని తెల్సుకున్న నా భార్య అప్పుడే మొదలెట్టింది.

'కుర్రాడు శుభ్రంగా బ్యాంకు ఉద్యోగం చేస్తున్నాడు. పోనీకండి (అంటే యేమిటో ఆవిడకే తెలియాలి) మనవాళ్ళల్లో పెళ్ళికాని ఆడపిల్లలు చాలామంది వున్నారు. ఎవరికైనా చెప్పొచ్చి సంబంధం' అంటూ. నా మిత్రుల్లో పెళ్ళికాని వాడంటూ యెవరైనా వస్తే వాడికి మర్యాదలు నేం చెప్పకుండానే చేస్తుంది నా భార్య. ఆ వచ్చినవాడికి పెళ్ళయిందో వాడి ఖర్మ అంతే... నేనడిగి చెప్పించేదాకా వాడికి కాఫీ కూడా దక్కదు. కానీ స్నేహితుల్లో సంబంధాలు వెదకటం నాకిష్టం వుండదు. నా మిత్రుల్లో యెవరైనా నా తరపువాళ్ళని చేసుకుంటా నంటే వద్దని చెప్పనుగానీ నావల్ల మాత్రం ముందుకు రావద్దని ఖచ్చితంగా చెపుతాను. స్నేహానికి వివాహ సంబంధాలకి ముడిపెట్ట కూడదని నా సిద్ధాంతం. అలా జరిగితే ఆ



## మిత్రమా!

— పాలడుగు వెంకటేశ్వరరావు

మిత్రమా!
ఏమిటలాగ వున్నావు ?
ఎందుకలాగ అయిపోతున్నావు ?
ఆయువు పట్టును గట్టిగా పట్టుకుని
ఊపిరాడకుండా ఉక్కిరి బిక్కిరి చేసి
నరాల్ని తోడేసి జీవాన్ని పీల్చేసి
నిన్ను- చొక్కాపట్టుకుని నిలబెట్టి—నువ్వు
నిలువునా నీరుగారిపోయేలాగ చేస్తుంది -
దిగులు !
అందువలన- 'నిన్న'ని గురించి మరిచి పో
ఇపుడు
రేపటి గురించి ఆలోచించి కృంగి కృశించకు
నీది- నీ సొంతమయినది - నేడే
కనుక ఆనందాన్ని కొనుక్కుని ఈ రోజుని
ఖర్చు చెయ్యి
నిన్ను బలిగొనటాన్కి దొంగల్లాగ పొంచివున్న
దిగులూ గుబులూపటాపంచలై పారిపోతాయి
నీ సంతోషమే నీ బలంగా
నువ్వు నువ్వుగా కొన్నాళ్ళు నిలబడగలవు.



## అతిసర్వత్ర వర్జయేత్

రెంటిలో రెండోదిమాత్రం మిగిలి మొదటిది కరువైపోతుందని నా అనుభవంద్వారా నాకు తెల్సిన విషయం. ఈ నా గుణం నాభార్యకు నచ్చని విషయం. పైగా బొత్తిగా నచ్చని విషయం, తను అలాగే అంటుంది. 'నచ్చని విషయం' అని మాత్రమే చెబితే నాలో తనకి నచ్చే విషయాలు కొన్ని వున్నయ్యని అవతలి వాళ్ళు భ్రమ పడతారని ఆవిడ భయం. ఆ భ్రమ అవతలి వాళ్ళ కెన్నడూ కలగనివ్వదు.

ఇంతకూ చెప్పొచ్చిందేమిటంటే ఆవిడ తన వాళ్ళ సంబంధం యేదో బాబూరావుకు నిశ్చయం చెయ్యాలని దృఢంగా నిశ్చయించుకుంది గావల్ను; దాంతో బాబురావుకు మా యింట్లో పెళ్ళికొడుకు మర్యాదలు జరిగినయ్. నాతో చాలాసార్లు అంది కూడాను. 'అతన్నొకసారి కదలెయ్యండి' అంటూ.

దాంతో నాకు చిర్రెత్తుకొచ్చి 'ఏం ? మీవాళ్ళు మీ అక్కచెల్లెళ్ళకు పెళ్ళిళ్ళు చేసేందు కంత కష్టపడ్డారా యేం ? ఎప్పుడూ యే ఆడపిల్ల చెర వదలిద్దామా అన్నట్టు కూర్చుంటావ్' అనేవాణ్ణి.

'అయ్యో రాత ! మావాళ్ళు అంత కష్టపడి వెదికితే మాకీ సంబంధా లెందుకొస్తయ్ ? మా పని హాయిగానే వుండేది' అనేది.

అదిగో సరిగ్గా అందుకే నేను పెళ్ళిళ్ళు కుదిర్చే వ్యవహారాల వైపుకు పోను. నా భార్య అన్న పై మాటలు ప్రతి స్త్రీ అనుకుంటుందని నాకు తెల్సు. నా భార్య మాత్రం తనొక్కర్తే అలా అనుకోవాల్సి వస్తోందనుకుని తన మీద తనే బోల్డు జాలి చూపించేసుకుంటుంది. అంతేకాదు— ప్రతి మగవాడు కూడా అట్లాగే అనుకుంటాడని కూడా నాకు తెల్సు. కాకపోతే ఆడవాళ్ళలా తరచు పైకి చెప్పడు; అంతే తేడా. అందుచేత స్నేహితులకి పెళ్ళి సంబంధాలు చూడకూడదన్నది నా నిర్ణయం.

ఇలా బాబూరావు మా యింటికి వస్తూ వుండే రోజుల్లో వకతడవ అతన్ని మురళీ మోహన్‌గారికి పరిచయం చేశాను. ఆయన బ్యాంకులో వుండే డబ్బునీ, ఆ వుద్యోగస్తుల కిచ్చే జీతాల్నీ, అందులో పైకి వచ్చిన వాళ్ళనీ, అందులో పైకెంతవరకూ వెళ్ళవచ్చో చెప్పి— "ఆకాశమే మీ పరిమితి" అన్నారు. ఆరోజున నుమ్మల్ని త్వరగానే విడిచి యింటికి వెళ్ళారు. ఆయన వెళ్ళంగానే బాబూరావన్నాడు !

'మా బ్యాంకులో వుద్యోగం తెచ్చుకోవటానికియిరవై వేలు మేనేజింగు డైరెక్టరుకు ఇవ్వాలండి ... యిస్తారు ... కానీ నేను మాత్రం ఓపెన్ కాంపిటీషన్లో నెగ్గి వచ్చాను' అని.

బాబూరావు చురుకైన వాడేనని నాకంతకు పూర్వమే తెల్సు. పైకి రాగల్గిన వ్యక్తేనని నా నమ్మకం. ఆ తర్వాత బాబూరావు తరచు మురళీమోహన్‌గారిని కల్సుకుంటూ వుండేవాడు. ఆసంగతి అతని ద్వారానో, మురళీమోహన్‌గారి ద్వారానో నాకు తెలుస్తూనే వుండేది.

బాబూరావుని మురళీమోహన్ గారికి పరిచయం చేసిన రెండు నెలల తర్వాత నను కుంటాను బాబూరావు నాకొక రోజున హోటల్లో కలిశాడు. నా భార్య వాళ్ళ బాబాయి కూతురు పెళ్ళికి వెళ్ళింది. అందువల్ల నా భోజనం హోటల్లోనే.

(36వ పేజీ చూడండి)

(గత సంచిక తరువాయి)

























[ఇంకా వుంది]

"అల్లాంటి విషయం కాదు. వనజ గురించి. ఆ పిల్లకి ఇక్కడ ఆడపిల్లలలాగా మొగపిల్లల్తో తిరగాలని అనిపించటం తప్పు కాదు. ఇక్కడ ఆడపిల్లల తల్లులు తీసుకొనే జాగ్రత్తలు నువ్వుకూడా తీసుకోవాలి.''

''అంటే?'' అని అడిగింది లక్ష్మి.

''ఎప్పుడేమౌతుందో మనం చూడంకదా! మీ వనజకి పాలల్లో టాబ్లెట్స్ వేసి తాగిస్తూ వుండు. పిల్లలు ఉద్రేకంలో ఏం చేసినా ఇబ్బంది వుండదు. మా అబ్బాయి మీదకి నువ్వు దండయాత్రకి వస్తావనికాదు నా భయం. మా అబ్బాయిని పెళ్లి చేసుకోడానికి మీ వనజే ఇష్టపడకపోవచ్చు. మా అబ్బాయి కూడా పడకపోవచ్చు. వాళ్లిద్దరు ఇష్టపడితే ఇబ్బందే లేదు'' అంది బెట్టీ.

లక్ష్మి కొంచెం సనాతనపు మనిషి. బెట్టీ దూరదృష్టితో చెప్తున్న విషయానికి లక్ష్మికి కోపం వస్తుందని పార్వతి అనుకొంది కాని లక్ష్మి నవ్వేసింది. ఆ నవ్వు నిష్కల్మషంగా హాయిగా వుంది.

''నాకు బాబ్ గురించి ఏ బెంగా లేదు. ఇంకా మా అమ్మాయే దుడుకుగాని'' అంది లక్ష్మి. పార్వతి ఆశ్చర్యపోయింది.

''బెట్టీ! సంజయ్, మరియన్ వచ్చారు'' అంటూ ఇయాన్ బెట్టీని పిలిచాడు అందరు లౌంజ్‌లోకి వెళ్లారు.

సంజయ్ చాలా సరదాగా కబుర్లు చెప్తున్నాడు మరియన్ మిగిలిన ఆడవాళ్లతో కూర్చుంది. అడిగినవాటికి నెమ్మదిగా జవాబులు చెప్పింది ''ఈ పిల్ల చాలా మంచిది. అందమైంది. అందుకే సంజయ్ ఈ పిల్ల నిష్టపడివుంటాడు'' అనుకొంది పార్వతి.

ఉన్నట్టుండి ''మావాళ్ల వైట్ ఆస్ట్రేలియన్ పాలసీ మిమ్మల్ని చాలా బాధపెడ్తుందేమోకదా?'' అని అడిగింది మరియన్.

''అది ప్రభుత్వపు పాలిసి. కాని ప్రజల్లో చాలమంది మాపట్ల స్నేహంగా వుంటారు'' అంది లక్ష్మి.

''రంగులో ఏముంది? మనుషుల్లో వుంటుందికాని'' అంది బెట్టీ.

''ఆమాట అనకండి. మా దేశంలో అల్లా కాదు. ఆడపిల్ల నల్లగావుంటే అందంగావున్నా ఓ పట్టాన పెళ్లి కాదు. అబ్బాయి ఎంత నల్లగా వున్నా తెల్లగావున్న పిల్ల కావాలని అంటాడు. తెల్లగావుంటే కనుముక్కుతీరు బాగాలేకపోయినా పెళ్లిళ్లవుతాయి. మా సాహిత్యంనిండా ... ఆమె నల్లగా అసహ్యంగా వుంటుంది ... ఈమె తెల్లగా అందంగా వుంటుంది ... అని వ్రాస్తారు. మాకున్నంత తెలుపు నలుపు గొడవ ఇక్కడ లేదు. శంకరరావు నన్ను పెళ్లి చేసుకొనేదాక మా నాన్న నాకు పెళ్లవదేమో అని బెంగపెట్టుకొన్నాడు'' అంది పార్వతి.

''నీకేం బొమ్మలా ఉంటావ్!'' అంది బెట్టీ.

''పారు చెప్పింది చాలా నిజం. మీకంటే




(గత సంచిక తరువాయి)

మాకు రంగు పట్టింపు లెక్కువ. మావారిని మా దేశంలో అందరు పచ్చని ఛాయ అంటుంటే గర్వంగా ఫీలయ్యేవాళ్లం. ఈ దేశం వచ్చిన మొదట్లో ఓ పిల్లాడు 'ఆయన్ని యూ ఆరె బ్లాకీ' అన్నాడు. ఆయన చాలా బాధపడ్డాడు. ఇప్పుడంటూ ఉంటారు. నాకంటే నల్లనివాళ్లని నేను బ్లాకీ అనేవాడిని. నాకంటే తెల్లనివాళ్లు నన్నన్నారు'' అంది లక్ష్మి

''బాబ్ నన్ను తన గర్ల్‌ఫ్రెండ్‌గా ట్రీట్ చేస్తున్నాడు కాని నేను బాబ్ ఏ నీగ్రోవో అయి నాకంటే నల్లగా ఉండి ఉంటే ఛస్తే అతన్తో తిరిగేదాన్ని కాను'' అంది వనజ.

బెట్టీ లోపలికి వెళ్లి వచ్చి ''భోజనాలు రెడీ భోంచేద్దామా?... పార్వతి బాబుని లోపల మంచం మీద పడుకోపెట్టు'' అంది. పార్వతి బాబును లోపల పడుకోబెట్టి ఓవర్‌కోట్ కప్పి వచ్చింది.

బెట్టీ పక్కన ఒకవైపు శంకరరావు మరో వైపు రంగస్వామి కూర్చున్నారు. పార్వతికి ఓ పక్కన సంజయ్ మరో వైపున రంగస్వామి కూర్చున్నారు. మరియన్‌కి, లక్ష్మికి మధ్య బాబ్ కూర్చున్నాడు. లక్ష్మికి వనజకి మధ్య ఇయాన్ కూర్చున్నాడు

''ఇక్కడ చోటు కొంచెం తక్కువగా ఉంది.

**జరిగిన కథ - 7 : కొత్త జీవితం** గడపటానికి స్వదేశం నుండి ఆస్ట్రేలియా వెళ్లిన శంకరరావుని, పార్వతిని — రంగస్వామి, ప్రొ. బ్రౌన్‌లు సాదరంగా ఆహ్వానించి వాళ్ల ఫ్లాట్‌కి తీసుకువెళ్తారు. పార్వతి టీచర్ ఉద్యోగానికి ప్రయత్నించి నిరాశ చెందుతుంది. తర్వాత కొన్నాళ్లకు ఒక బట్టల కంపెనీలో ఉద్యోగానికి చేరుతుంది. ఉన్నంతలో 'వినాయక చవితి' పండుగ జరుపుకుంటారు శంకరరావు దంపతులు. శంకరరావు పనిచేస్తున్న యూనివర్శిటీలోని విద్యార్థులు తమ జీతాలు తగ్గించాలని ఆందోళన చేస్తుంటారు. శంకరరావు, రంగస్వామి కారును కొందామని ప్రయత్నాలు జరుపుతుంటాడు. హరే రామ, హరే కృష్ణ సమాజంలో చేరిన హారీని తన తల్లి 'జోన్' పడే బాధను తెల్పి, ఇంటికి వచ్చేయమంటాడు శంకరరావు స్మిత్‌ల ఇంటికి భోజనానికి వెళ్తారు శంకరరావు, పార్వతి.

చాలామందిని ఇరికించాం. ఇబ్బందిగా ఉన్నా కొంచెం సర్దుకోవాలి'' అన్నాడు ఇయాన్.

''నా కాళ్లు ఎవరికైనా రాసుకొంటే నేను కావాలని రాసాననుకోకండి ఇక్కడ చోటు లేదు. ఏ కొంచెం కదిలినా ఎవరికో కాళ్లు తగిలేలా ఉన్నాయి'' అంది బెట్టీ.

బావుందీ ముసలావిడ సరసం అనుకొంది పార్వతి. లక్ష్మి నవ్వింది.

''ఇదే మాట మనకి పెళ్లి కాకముందు నా పక్కన పార్టీలో కూర్చుని అన్నావు! నేను దాన్ని సీరియస్‌గా తీసుకోక, ఇంటెన్షనల్‌గానే అనుకొన్నాను మరుసటివారం ప్రపోజ్ చేసాను'' అన్నాడు ఇయాన్ నవ్వుతూ.

''నేను కావాలనే కాళ్లు తగిలిస్తానంటావా?'' అంది బెట్టీ కోపం నటిస్తూ.

''అదంతా నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా మన సర్కిల్ ఆఫ్ ఫ్రెండ్స్‌లో నువ్వు చాలా పాప్యులర్ అని. ఆ పాప్యులారిటీ సీక్రెట్ వచ్చిందో నాకేం తెల్సు! లక్ష్మీ! రెండేళ్లక్రితం మేము షిప్‌లో లండన్ వెళ్లామా! అప్పుడు పోర్టులో బెట్టీని ముద్దుపెట్టుకొని గుడ్‌బై చెయ్యటానికి వచ్చిన మగజనాన్ని చూడాలి. క్యూలో ఆఖరివాడు ముద్దుపెట్టుకొనేటప్పటికి సరిగ్గా గంటపట్టింది'' అన్నాడు ఇయాన్. అందరు నవ్వారు. ఆ నవ్వులో సంజయ్ కాళ్లు పార్వతికి తగిలాయి. కావాలని తగిలించాడా? బెట్టీ చెప్పినట్టు తగిలాయా? అన్నది పార్వతికి అర్థంకాలేదు. రెండోవైపుకు జరిగితే తను రంగస్వామిమీద పడ్డట్టుంటుందేమోనని కదలకుండా కూర్చుంది.

కాస్సేపటికి సంజయ్ కొత్తగా ఓపెన్‌చేసిన డిస్పెన్సరీవైపు సంభాషణ సాగింది.

''మా డిస్పెన్సరీలో ముందు ఓ గది వుంటుంది. అక్కడ నా సెక్రటరీ పేషెంట్స్‌కి స్లిప్స్ ఇస్తుంది. ఆ వరసలోవాళ్ళని నేను ఎగ్జామినేషన్ రూమ్‌లోకి తీసుకువెళ్తాను. అక్కడకి రాగానే వాళ్లని బల్లమీద పడుకోమని ఎగ్జామిన్ చేస్తాను. అందులోకి ఎవర్నీ రానివ్వను, పేషెంటును తప్పించి.''

''ఈ డాక్టర్లమీద చాలా జోక్స్ వున్నాయి. వీళ్ల దగ్గరకి అందంగావున్న ఆడవాళ్ళు ముక్కుమీద కురుపు లేసిందని వెళ్లినా నగ్నంగా ఆ బల్లమీద పడుకోబెట్టి అంతా పరీక్షిస్తేగాని మందివ్వరుట'' అన్నాడు బాబ్.

''ఇంత ఖర్చుపెట్టి చదువుకున్నది అందుకే కదా!'' అంటూ సంజయ్ నవ్వాడు. అతని కాళ్లు మళ్లీ పార్వతికి తగిలాయి. తను టీచర్స్ కోర్సులో చేరడానికి వెళ్లినప్పుడు డాక్టర్ పరీక్షించటం గురించి ఆలోచిస్తున్న పార్వతి కాళ్లు తగలటంతో సర్దుకొని కూర్చుంది. దేశానికి దూరంగా వున్నప్పుడు ఈ భారతీయులకిదేం రోగం అనుకొంది అదే క్షణంలో శంకరరావుకూడా బల్లకింద అల్లాగే చేస్తున్నాడేమో అన్న అనుమానం కలిగింది పార్వతికి

సరిగ్గా అదే సమయంలో ఈ పార్వతి మెడికల్ ఎగ్జామినేషన్‌కి వెళ్లి సంజయ్ చెప్పిన

విధంగా ఆ మగ డాక్టర్ ముందు నగ్నంగా పడుకొని పరీక్ష చేయించుకొందా? అని శంకరరావుకి అనుమానం కలిగింది

బెడ్ రూమ్‌లో బాబు లేచాడు. బెట్టీ ఒక పాస్ట్రీ ఇచ్చింది. పార్వతి అది తీసుకొని బాబుకి పెట్టడానికి బెడ్ రూమ్‌లోకి వెళ్లింది వనజ "నేను హెల్ప్ చెయ్యనా?" అంటు వచ్చింది వనజ ఎత్తుకోగా పార్వతి తినిపించ సాగింది. ఈ ఉద్రిక్త వాతావరణంలో వనజకేం ప్రమాదం రాదా? బెట్టీ చెప్పినట్లు వనజ జాగ్రత్త తీసుకొంటే నయమేమోకదా! అనుకొని పార్వతి వనజ దగ్గర ఆ ప్రసక్తి తెచ్చింది. వనజ నవ్వేసి "బాబ్ అల్లాంటివాడుకాదు తొందర పడడు" అంది.

"నువ్వే పడచ్చుగా?" అంది పార్వతి, అల్లా అంటున్నందుకు సిగ్గుపడుతూనే

"అదీ అయింది నేను పాలల్లో బిళ్లలు వేసుకొని ఒక వీకెండ్‌లో తాగుతుంటే మా అమ్మ చూసింది. ఆ వీకెండ్‌కి నేను బాబ్‌తో వుడ్స్‌లోకి వెళ్తున్నాను నా ఫ్రెండ్స్ నాకిచ్చిన సలహా ప్రకారం దానికోసం వారంరోజులుగా ప్రిపేర్ అయ్యాను. అమ్మ కోపంతో వెర్రెత్తిపోయింది నేను లక్ష్యపెట్టలేదు నాన్నగారితో చెప్తానంది అవసరం అయితే ఇంట్లోంచి వెళ్లి విడిగా వుంటానన్నాను. ఆరోజు ఎంతో ఎదురుచూస్తూ బాబ్‌తో ఏకాంతంగా గడిపాను నెక్కింగ్ మినహాయించి ఆ రోజింకేం జరగలేదు, నేను బాబ్‌ని ప్రోత్సహించినా కూడా చివరికి నేను "నువ్వు ఇండియన్ గర్ల్‌తో డేట్ చెయ్యాల్సి వచ్చినందుకు చింతించాల్సిన పరిస్థితి కలిగించటం నా కిష్టంలేదు నేను ఆస్ట్రేలియన్ అమ్మాయినైతే ఎంత దూరం వెళ్తావో అంత దూరం వెళ్ళ నాకభ్యంతరంలేదు అన్నాను దానికి బాబ్ ఏమన్నాడో తెల్సా?" వనజ ఆగింది

"ఏమన్నాడు?" పార్వతి కుతూహలంగా అడిగింది.

"వచ్చే యేడు కోర్సు అవగానే నిన్ను పెళ్లి చేసుకొంటానుకదా! అప్పుడు నా ముచ్చటలన్నీ తీర్చుకొంటాను అందాకా ఇది చాలు అంటూ నన్ను గాఢంగా ముద్దుపెట్టుకొన్నాడు ఆ తరువాత నాకెప్పుడు మాత్రలు వాడాల్సిన అవసరం కనిపించలేదు. ఈ విషయం మా అమ్మతో చెప్తే చాలా సంతోషించింది" అంది వనజ

బాబు సప్పర్ తిని పడుకొన్నాడు. పార్వతికి లక్ష్మి బెట్టీతో "నాకు బాబ్ గురించి ఏ భయం లేదు ఇంకా మా అమ్మాయికే తొందరపాటు" అనటం గుర్తుకువచ్చింది స్మిత్‌లు చాలా మంచివాళ్లు వాళ్ల మాట్లాడే తీరు వాళ్ల పెరిగిన వాతావరణంబట్టీ వుంటుంది అంతే మంచితనానికి లోటులేదు మంచితనం ఏ ఒక్క దేశం సొత్తూ కాదు! మూర్ఖత్వం కూడా ఏ ఒక్క దేశం సొత్తూ కాదు సంజయ్‌లాంటి వాళ్ళ భారతీయుల్లోనూ వుంటారు ఈరోజుకీ రోజు తనకి కావాలని కాళ్ల తగిలించాడు మంచితనం మా సొత్తని భారతీయులెందుకు గర్వపడ్తారో! మొన్నమొన్నటిదాకా తనకీవిధమైన ఆలోచనలే వచ్చేవికావు! పార్టీ అయి యింటికి వెళ్తూ, శంకరరావు "నిన్ను పరీక్షించిన డాక్టరు నిన్ను నేకెడ్‌గానే పరీక్షించాడా?" అని పార్వతిని అడిగాడు

"ఊఁ"

"నీకు సిగ్గువెయ్యలా?" శంకరరావు తన పొజెసివ్‌నెస్ బయటపెట్టుకొన్నాడు.

"డాక్టరు ముందు సిగ్గేమిటి?"

"అనారోగ్యంతోకాక ఆరోగ్యంగా వున్నప్పుడు సిగ్గువెయ్యదా?"

"వెయ్యదు."

"పోనీ థ్రిల్లింగ్‌గా వుందా?"

"ఛీ! అసహ్యం."

శంకరరావు మాట్లాడలేదు డబ్బు నాశించి నలుగురి ముందు వివస్త్ర అయ్యే స్ట్రిప్‌టీజర్‌కి, ఉద్యోగాన్ని ఆశించి మరో పురుషుడి చేత స్తన శల్యపరీక్ష చేయించుకొన్న స్త్రీకి ఫిలసాఫికల్‌గా ఆలోచిస్తే తేడా వుందా? అన్న ఆలోచనలో పడ్డాడు



10

నవంబరు నెలతోపాటు వేసంకాలం మొదలైంది. డిసెంబర్‌లో పార్వతి కోర్సు పూర్తవుతుంది. సెలవలు మొదలవుతాయి. బాబ్జీకి రెండేళ్ళు నిండాయి. కొంచెం కొంచెం ఇంగ్లీషు మాట్లాడుతున్నాడు.

పార్వతి కోర్సు వర్కంతా బ్రహ్మాండంగా చేసింది. టీచింగ్ ప్రాక్టీస్‌లో మాత్రం మార్కులు బొటాబొటిగా వస్తున్నాయి. ఆమె సూపర్‌వైజర్ రెక్స్ అదోరకం మనిషి. ఇండియన్లంటే చులకన. అతను బియ్యే మాత్రమే చదివినా ఎమ్మే చదివిన పార్వతికంటే అధికుడనని అతని అభిప్రాయం. కారణం అతను తెల్లవాడు. అతను చదువుకొన్న బియ్యే తెల్లవాళ్ల బియ్యే!

ఆస్ట్రేలియాలో టీచర్స్‌కి యూనియన్ వుంది. వాళ్ళు ఆడ టీచర్లకి మగ టీచర్లతోపాటు సమానంగా జీతాలివ్వాలని ఘోరంగా పోరాడి విజయం పొందారు. అల్లాగే ట్రెయినింగ్‌లేని టీచర్లను స్కూళ్లలోకి తీసుకోరాదని షరతులు పెట్టి ప్రభుత్వాన్ని లొంగదీసుకొన్నారు. ఆస్ట్రేలియాలో ఎక్కువగా స్ట్రైక్‌లు చేసేది ఈ స్కూలు టీచర్సే! స్ట్రైక్ చేసేవారు ముందుగా మేము అందులో పాల్గొంటున్నామని వ్రాసివ్వాలి. స్ట్రైక్ చేసిన రోజులకి ప్రభుత్వం జీతం ఇవ్వదు. కాని ఉద్యోగానికి యూనియన్ రక్షణ వుంటుంది. ఇష్టంవున్నవాళ్ళు స్ట్రైక్‌లో పాల్గొనకుండా స్కూలుకి వెళ్లవచ్చు. వాళ్లకి ఆరోజులకికూడా జీతం వస్తుంది. పార్వతికి అల్లాంటిరోజుల్లో ఏం చెయ్యాలో తెల్సేదికాదు. శంకరరావు నడిగితే నలుగురితోపాటు స్ట్రయిక్ చెయ్యమనేవాడు. చేస్తే కోర్సులో ఫెయిల్ చేస్తారేమో అధికారులని పార్వతికి భయం. అందుకని స్కూలుకి వెళ్లేది. ఆ విషయంలో రెక్స్‌కి పార్వతిమీద కోపం వచ్చింది. షీల దగ్గరకి వెళ్లి ఈ విషయం మాట్లాడింది. అప్పుడు కృష్ణ, శంకరరావు లేరు. "నీ సూపర్‌వైజర్‌ని ఛార్మ్ చెయ్యి. దానికి పడని మగవాడుండడు" అని సలహా చెప్పింది.

పార్వతి భయపడింది. పరాయి మగవాడి దగ్గర వగలు వలకబోస్తే అక్కడితో ఆగక పోవచ్చును. అందులో ఈ ఆస్ట్రేలియన్ మగవాళ్లకి చొరవ ఎక్కువ. వాళ్లకి నీతిపట్ల అంత దృఢమైన అభిప్రాయాలుండవు. పైగా రెక్స్‌కి ఇండియన్లపట్ల అసలు గౌరవం లేదు. ఇండియాలో మగవాళ్లు ఆడ పని మనుషులమీద ఏమాత్రం ప్రోత్సాహం వున్నా చెయ్యి వేసినట్టుగా వీళ్లు భారత స్త్రీని సులభసాధ్యగా తలచి ముందుకు వస్తే తనప్పుడు తప్పుకోలేదు! అందుచేత వేరే మార్గం ఆలోచించాలి అనుకొంది.

శంకరరావుని అడిగింది సలహా. శంకరరావు "రెక్స్‌ని భోజనానికి పిలువు" అని సలహా యిచ్చాడు. ఆ వారం చివర పార్వతి రెక్స్‌ని, అతని భార్యని భోజనానికి పిలిచింది.

ఆ శనివారం రాత్రి బాబుని తొందరగా నిద్రపోగొట్టింది. మధ్యాహ్నమే పూరీకూర,

# ఆకర్షణ - వ్యామోహం

వెజెటబుల్ పులావ్, డెసెర్ట్ చేసేసి మొదటి రెండు వేడిగా వుండేందుకు ఓవెన్‌లోను, మూడోది ఫ్రిజ్‌లోను పెట్టేయడంతో తీరుబడిగా తయారయ్యేందుకు వీలైంది. శ్రద్ధతీసుకొని తయారైంది. శంకరరావు పక్కనున్నప్పుడు అలంకరించుకొంటే రెక్స్‌ని కావాలని ఛార్మ్ చేసినట్టు కాదు, కాని ఛార్మ్ చెయ్యవచ్చు! అనుకొంది. చీర బొడ్డు కనిపించేలా కట్టుకొంది. పార్వతి చాలామంది భారతీయ స్త్రీలలాగా మెడ కొంచెం లోతుగా పెట్టుకొనే కుట్టుకొంటుంది. అందులో ఆరోజు మరికొంచెం లోతుగా వున్నది

## నిదురరాని మరో రాత్రి

అలా చూడకు
ఎద పునాదుల్ని కదిలించకు
నా కళ్ళల్లో
ఎన్ని కన్నీటి సముద్రాలో
నీకేం తెలుసు ?
ఎద పగుళ్ళలో
ఎన్ని జిల్లేళ్ళు మొలకెత్తాయో
నీకేం తెలుసు ?
అంబరమంత అనుభూతి
గుండెల్లో వున్నా
అణువంత అనురాగం కోసం
ఎంత తపించానో నీకు తెలుసు.
ఎపుడో నే పారేసుకున్న వసంత రాత్రుల్ని
వెన్నెల వెండి పూత పూయకు
వడిలిన ఈ గుండెలపై.
నీ తలపులతో
నా గుండె తగలబడనీ.
కానీ !
నీ తలపులతో ఈ రాత్రి
నిదురరాని మరో రాత్రి
నీ తలపే రాని రాత్రి
సూర్యకిరణం సోకని
జీమూతధాత్రి.

—"మరుమల్లిక"

ఏరి వేసుకొంది. పలచటి చీర కట్టుకొంది. చీర లోపలి నుంచి బొడ్డు, లోతు మెడవల్ల బహిర్గత మౌతున్న సగం సగం అందాలు కనిపించీ కనిపించకుండా వుండటం అద్దంలో చూసుకొని తృప్తిపడింది. "అందం ఎప్పుడు లీలామాత్రంగా గోచరిస్తూ ఊహకి మేతవేస్తూ వుండాలి. ప్రత్యక్షమైతే క్షణకాలం మెరిసి మాయం అవాలి. అంతేగాని ఆస్ట్రేలియా బీచ్‌ల్లో అమ్మాయిల్లాగా వుంటే ఊహ కవకాశమే లేదు" అంటాడు శంకరరావు. స్త్రీలు పురుషుల్నాకర్షించాలంటే పురుషులకేది ఆకర్షణీయంగా కనిపిస్తుందని పురుషులనుకొంటారో అల్లాగ తయారవాలి. అల్లాగే పురుషులూను. అంతేగాని తాము ఎల్లా వుంటే అవతలవాళ్లకి అందంగా కనిపిస్తామని తాము అనుకొంటారో అల్లా తయారైతే ఊహించిన ఫలితాలు రావచ్చు రాకపోవచ్చు. ఇవన్నీ శంకరరావు అభిప్రాయాలు. ఈ అభిప్రాయాలు పార్వతికి మనస్సుకు పట్టాయి. అందుకనే అల్లా తయారైంది!

ఎనిమిదిగంటలవుతూనే రెక్స్ అతని భార్య లీటా వచ్చారు. రెక్స్ టెరిలీన్ కాటన్ మిక్చర్‌తో తయారుచేసిన ట్రౌజర్, షర్టు వేసుకొన్నాడు. లైట్ల కాంతిలో మెరిసే టై వేసుకొన్నాడు. లీటా మెడదాకా వున్న గౌను తొడుక్కుంది. ఆ గౌను తొడలమీద ఎత్తుగా ఆగిపోయింది. లీటా గౌను మెడ మాత్రం చిన్నగా వుంది. చేతులులేని ఆ గౌనుకి చేతులు దూర్చడానికిగాను వున్న కంతలు విశాలంగా వున్నాయి. శంకరరావు, పార్వతి, వాళ్లకి గుమ్మం దగ్గర స్వాగతం పలికి లోపలికి తీసుకువెళ్లారు.

రెక్స్, శంకరరావు మూడురౌండ్లు విస్కీ లీటా, పార్వతి మూడురౌండ్లు షెర్రీ తీసుకొన్నాక పార్వతి భోజనం వడ్డించింది. రెక్స్ వెజెటబుల్ పులావ్‌లోకి హాట్‌పికిల్ కావాలని అడిగి వేయించుకొని వేళ్లు నాకుతూ భోంచేసాడు. లీటాకి ఆ కారాలు తింటుంటే కళ్లనీళ్లు తిరిగాయి. అన్నం దగ్గర మంచినీళ్ల బదులు లైట్ వైన్ సర్వ్ చేసాడు శంకరరావు.

"నేను డ్రైవ్ చెయ్యాల్సి. నాకు మిల్క్ యివ్వండి. నోటి మంటకూడా తగ్గుతుంది" అంది లీటా.

"ఆడవాళ్ళు డ్రైవ్ చెయ్యటం మొదలు పెట్టాక మగవాళ్లకి మితంగా తాగాల్సిన అవసరం పోయింది. నాక్కొంచెం వైన్ పొయ్యి శంకూ!" అన్నాడు రెక్స్ గ్లాసులో వున్న వైన్ ఖాళీచేస్తూ.

"పార్వతికి డ్రైవింగ్ రాదు. బయటికి వెళ్తే నేనే డ్రైవ్‌చెయ్యాలి. అందుకని ఎక్కువ తాగను. ఇవాళ నాకా భయంలేదు. నీతోపాటు సమానంగా తాగుతాను" అన్నాడు శంకరరావు వైను తన గ్లాసులోకి వంచుకొంటూ.

వాంతులవుతాయేమో అన్న భయంతో పార్వతి మితంగానే తాగింది. భోజనాలయ్యాక శంకరరావు కాఫీ రుచిలో వుండే లిక్కర్ ఇచ్చాడు రెక్స్‌కి.

"ఇవాళ పారూ వంట పారూలాగానే గార్జియస్‌గా వుంది కదూ లీటా" అని అడిగాడు రెక్స్!

"మరే! చాలా బావుంది వంట. నా దగ్గర కూడా ఓ చీర వుంది. నీలా కట్టుకోలేను. నువ్వు నేర్పాలి" అంది లీటా.

"థాంక్స్. తప్పకుండా నేర్పుతాను" అంది పార్వతి. అన్నాక పమిటకొంగు దోపుకుంటూ తన సన్నని నడుముని, బొడ్డుని, ఎత్తైన వక్షాన్ని క్షణకాలం ప్రదర్శించింది.

"లీటా! చీర కట్టుకోదల్చుకొంటే పారు లాగా కట్టుకోడం నేర్చుకో!" అన్నాడు రెక్స్.

"నా కంతబాగా కట్టుకోడం రాదు" అంది పార్వతి.

"ఏమో చీరలో నిన్ను చూస్తుంటే అప్పుడప్పుడు నా మతి పోతూ ఉంటుంది."

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥ల గా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ : అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ : మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

OBM-5709 A/1 TEL

పార్వతికి కాస్సేపు గుండె ఆగి కొట్టుకోడం మొదలైంది. శంకరరావుకీ సంభాషణ ధోరణి నచ్చలేదు. కాని రెక్స్‌మీద తాగుడు ప్రభావం పూర్తిగా పనిచేయటం మొదలుపెట్టింది.

"మాలో ఒక జోక్ వుంది. ఇండియన్‌లు చీరకింద లాగూలు వేసుకోరని" అన్నాడు రెక్స్. ఎవరూ మాట్లాడలేదు. "నాకు ఆ విషయంలో అనుమానం మిగిలిపోయింది. ఆ జోక్ నిజమేనా?" అని అడిగాడు రెక్స్.

"రెక్స్!" అని గదిమింది లీటా.

"నేనో విషయం చెప్పనా?" అన్నాడు శంకరరావు. అతనుకూడా బాగా తాగున్నాడు.

"చెప్పు" రెక్స్ అడిగాడు.

"మాలో ఒక జోకుంది. ఆస్ట్రేలియన్ ఆడవాళ్ల గురించి అల్లాంటి అనుమానం రావటానికి అవకాశం లేదని."

"ఎందుకని?"

"వాళ్ళు లాగూ వేసుకొంటారన్న విషయం మాకు స్పష్టంగా కన్పిస్తుంటే! మీ మినిస్కర్ట్‌ల ధర్మమా అని."

లీటా కాళ్లు రెండూ మరింత దగ్గరగా కూడదీసుకొంది. "ఐ టేకిట్! అన్నాను, పడ్డాను. వెల్లు! పోనీ ఇండియన్సు కూడా వేసుకొంటే ఈ మినిస్కర్ట్స్, మాక్కూడా ఈ అనుమానాల బాధ తప్పుతుందికదా?" అన్నాడు రెక్స్

"ఇండియన్లకి తాగుడు పెద్దగా అలవాటు లేదు. అందుకని మేము వాళ్లకి లాంగర్ క్లోత్స్ కొనగలం" అన్నాడు శంకరరావు.

"రెక్స్! ఇంక ఈ చర్చ ఆపెయ్! మనం తొందరగా ఇంటికి వెళ్లాలికూడాను" అంది లీటా చర్చధోరణి మరో దారికి పట్టిస్తూ.

"మరే!" అన్నాడు రెక్స్. ఆపైన "నువ్వు మరుసటేడు ఎక్కడ పన్చేస్తావు పారూ?" అని అడిగాడు.

"టీచింగ్ ప్రాక్టిస్ గట్టెక్కాలిగా రెక్స్!" అంది పార్వతి.

"ఐ గారంటీ దట్" అన్నాడు రెక్స్.

"థాంక్స్! వాళ్లు ఎన్నెక్కడ పోస్ట్ చేస్తారో?"

"మా స్కూలే అడుగు."

"అల్లాగే."

రాత్రి పన్నెండుగంటలవుతుండగా రెక్స్, లీటా లేచి సెలవు తీసుకొన్నారు.

పక్కమీదకు చేరాక శంకరరావు "రెక్స్ నిన్ను ఆరాధిస్తాడని నాకు తెలియదు" అన్నాడు.

"నా మొహం ఆరాధన! నన్ను టీచింగ్ ప్రాక్టిస్‌లో కాల్చుకొనితింటాడు. ఆ బాధ పడలేకే కదా ఇవాళ పిలిచాం" అంది పార్వతి.

"ఇవాళ నిన్ను తెగపొగిడాడు అందంగా వుంటావని రెచ్చగొట్టే అందమని. నీకేం అనిపించలేదా?"

"ఏమనిపిస్తుంది?"

"గర్వం కలగలేదా?"

"ఎవరికైనా ఎవరైనా పొగుడుతుంటే ఎందుకు బావుండదు. పొగడ్తలు నచ్చని వాళ్ళుంటారా? మీరు పొగిడినా నాకంతే బావుంటుంది."

"అది చెప్పే విధానం అదికాదు. నేను కాకుండా వేరొకరు పొగిడినా, పొగడ్త పొగడ్తే, నీకు గర్వంగానే వుంటుంది. అవునా?"

"అల్లా అర్థాలు తీస్తే ఏం చెప్పను? ఎవరైనా బావున్నావు అంటే సంతోషపడని దెవరు? అల్లా సంతోషపడటం సహజం."

"పరాయి మగాడు పొగిడితే తేళ్లు కుట్టినట్టు, జెర్రులు పాకినట్టు ఉంటుందంటూ కథల్లో చదువుకొన్నాను. అందుకడుగుతున్నాను."

"వ్రాసినవాళ్ల కుంటుందేమో! లేక అల్లా వ్రాయకపోతే పాఠకులు తిడ్తారన్న భయంకొద్దీ వ్రాస్తారేమో! లేక వ్రాసినవాళ్లు మగవాళ్లయితే వాళ్ల ఆడవాళ్లకల్లా వుండాలన్న కోర్కెని వ్రాతల్లో వెలిబుచ్చుతారేమో!"

"కొందరు రచయిత్రులు కూడా అల్లా వ్రాసారే?"

"వాళ్లని ఎవరైన పొగిడివుంటే వాళ్లకే తెలిసేది! మన పవిత్ర భారతదేశంలో పరాయి స్త్రీని ఎవరూ పొగడరు. అందుకని అనుభవంలేని వాళ్లు అందరు అనేది విని ఎవరన్నా పొగిడితే జెర్రులు పాకినట్టుంటుంది కాబోలు అనుకొని రాసివుండాలి. ఒకవేళ అనుభవంవుంటే ... మన దేశం ఏమైపోతున్నట్టు?" అంది పార్వతి.

పార్వతి అంత అతిగా మాట్లాడం శంకరరావుకి ఆశ్చర్యం కలిగించింది. ఇది పూర్తిగా మధువు కలిగించిన మత్తు అయివుండదు. ఇది పొగడ్త కలిగించిన నిషా! అనుకొన్నాడు శంకరరావు.

అయితే "నేను పొగిడినా మిగతా స్త్రీలల్లాగే నిషా పొందుతారన్నమాట" అనుకొన్నాడు నిద్రలోకి జారుకొంటూ శంకరరావు.

మర్నాడు యూనివర్శిటీలో కాఫీ తాగుతుంటే శంకరరావు ప్రొఫెసర్ దగ్గర సెక్రెటరీగా ఉన్న ఆమె వచ్చి అతని టేబుల్ దగ్గర కూర్చుంది. కొంచెం మధ్యవయస్సు స్త్రీ ఆమె. శంకరరావుకి ఆమె అంటే గౌరవం. ఆ కితం రోజు పార్వతితో జరిగిన సంభాషణ శంకరరావు మీద పనిచేస్తోంది. సెక్రెటరీని పరిశీలనగా చూసాడు.

"ఏమిటల్లా స్టేర్ చేస్తున్నావు శంకూ!" అని అడిగింది.

"నువ్వు వేసుకొన్న ఎర్రడ్రెస్సు నీకు చాలా నప్పింది. నీ కాంటూర్స్‌కి బాగా పట్టింది. నువ్వివాళ గార్జియస్‌గా ఉన్నావు" అన్నాడు.

ఆ సెక్రెటరీ ఇండియన్ దగ్గర ఈ చొరవ ఊహించలేదు. ఆశ్చర్యపోయింది. అదే ఆస్ట్రేలియన్ అని ఉంటే మర్యాదకి అంటున్నాడనుకొనును. ఇండియన్ అంటే అది మనస్ఫూర్తిగా అంటున్న దయి ఉండాలని తను ఆ డ్రెస్సులో బాగా ఉండి ఉండాలని అనుకొని సిగ్గుపడ్తూ,

"థాంక్స్! మెనీ థాంక్స్" అంది. ఈమధ్య, మధ్యవయస్సు వచ్చాక ఎవర్నూ ఆమె కంత కాన్ఫిడెన్సు ఇవ్వలేదు.

పార్వతి చెప్పింది నిజమేనన్న మాట. ఈసారి ఈ ప్రయోగం ఎవరైనా ఇండియన్ మీద

## ఇది విన్నారా?

★ కళాభినేత్రి కుమారి వాణిశ్రీ నుంగంబాకం సమీపంలో ఒక కళ్యాణమండపాన్ని కడుతున్నది. పూర్తికావస్తున్న ఈ మండపంలో మొదటి పెళ్లి మన కళాభినేత్రిదే అయితే బాగుంటుంది.

★ కొంతమంది సంగీత దర్శకులకు కొన్ని రికార్డింగ్ థియేటర్లో రికార్డింగ్ జరపడమంటేనే యిష్టం. కె. వి. మహదేవన్‌గారికి విజయా గార్డెన్స్ రికార్డింగ్ థియేటర్, చక్రవర్తిగారికి జెమినీ రికార్డింగ్ థియేటర్, సత్యంగారికి ప్రసాద్ రికార్డింగ్ థియేటర్ అంటే ఎక్కువ యిష్టం.

★ "అంగడి బొమ్మ" చిత్రంలో హీరోయిన్‌గా నటించిన సీమా ఒక డాన్స్ దర్శకుడి వద్ద అసిస్టెంట్‌గా పని చేస్తుండేదట. ఆమె చిత్రాల్లో నటించడం మొదలెట్టాకకూడా ఆమె తిరిగి తన ట్రూపులో చేరుతుందని ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడట ఆ డాన్స్ మాస్టర్. పాపం! "హతవిధీ".

★ హిందీ చిత్రరంగంలో సంజీవకుమార్ "మే" మాసంలో ఏ శుభకార్యాలను చేయరట. ఎందుకనడిగితే ఆ నెల తన కచ్చిరాదంటారట. తెలుగు చిత్రరంగంలో ప్రతి "మే" నెల ఏ షూటింగ్‌లోనూ పాల్గొనరు శ్రీ అక్కినేని. ఎందుకనడిగితే, విశ్రాంతికోసం ఏదైనా వేసవి విడిదికి వెళ్తాను గనుక అంటారు.

★ హిందీ చిత్రరంగంలో అమితాబ్‌బచన్ కారు స్టూడియోవైపు వెళ్లిందంటే టైమ్ ఉ॥ 7-15 అని తన గడియారాన్ని సరిచేసు కుంటారట బచన్ ఇంటికి సమీపంలో వున్న ఓ సంగీత దర్శకుడు. అంటే అంత కరెక్ట్ అన్నమాటేగా. తెలుగు చిత్రరంగంలో అంతటి కీర్తి ఎన్. టి. ఆర్. గారికే దక్కుతుంది.

— శ్రీనివాస్

చెయ్యాలి. ఎవరైతే బావుంటుంది? ఇంకెవరూ షీలే! లక్ష్మితో అనడం భావ్యం కాదు. వనజ పూర్తిగా ఆస్ట్రేలియన్‌లా బిహేవ్ చేస్తుంది. పైగా పెళ్లి కానిది. పెళ్లయిన షీల, పార్వతిలాగే రియాక్ట్ అవుతుందో లేదో చూడాలి!

"ఏమిటి ఆలోచిస్తున్నావు శంకూ! పోదామా?" అంది సెక్రెటరీ.

"పద. ప్రొఫెసర్ బ్రౌన్ కనిపించటంలేదీ మధ్య."

"కన్సల్టింగ్ వర్క్‌తో బిజీగా వున్నాడీమధ్య ప్రొఫ్" అంది. ఇద్దరూ డిపార్ట్‌మెంట్ కేసి నడిచారు.

ఆ వీక్ ఎండ్‌న శుక్రవారం రాత్రి బాబుని పడుకోబెట్టి పోర్ట్ తాగుతూ టి. వి. ముందర కూర్చున్నారు శంకరరావు, పార్వతీను. డోర్ బెల్ మోగింది. రాత్రి తొమ్మిదవుతోంది. అప్పుడే చీకటిపడింది. తలుపు తెరిచాడు శంకరరావు. షీల, కృష్ణ వచ్చారు.

"రండి. వెల్‌కమ్ వెల్‌కమ్" అంటూ శంకరరావు ఆహ్వానించాడు.

[34 వ పేజీ చూడండి]

# సినిమా విశేషాలు

## దాసరి ... శోభన్ కలిసిన సిరిపురంలో ఓ సిన్నోడు

''బలిపీఠం'' చిత్రం విడుదలయిన రోజుల్లో ... శ్రీ దాసరి ... శ్రీ శోభన్ కలిసి అనేక చిత్రాలలో పని చెయ్యగలరని, యీ కలం పాఠకులకు తెలిపింది.

కారణాంతరాలవల్ల, ఈ కలం చెప్పిన జోష్యం నిజం కాలేకపోయింది. ఇప్పుడు అది నిజం అవుతుంది అని నిరూపించడానికి నిదర్శనంగా ''సిరిపురంలో ఓ సిన్నోడు'' చిత్రం కార్యరూపం ధరిస్తూంది.

శ్రీ దాసరిని దర్శకుడుగా, శ్రీ శోభన్‌బాబును కథానాయకుడుగా ఎంపికచేసిన నిర్మాత ఎవరో పాఠకులకు తెలపాలిగా !

యూన్సీ ఎంటర్‌ప్రైజస్ సంస్థకు అధినేత అయిన వై. అరుణ్‌ప్రసన్న ''శోభన్...దాసరి'' గార్లను కలిపారు

శ్రీ ఏ. బి. శ్రీరాములు సమర్పించు, శ్రీ కాకర్ల ... కృష్ణ నిర్మాణతగా వ్యవహరించు యూన్సీ ఎంటర్‌ప్రైజస్‌కు, దర్శకుడు ... నాయకుడు ఏప్రిల్, మే, జూన్ మాసాలలో కాల్‌షీట్లు యిచ్చారు.

పూర్తి అవుట్‌డోర్‌లో నిర్మింపబడే ''సిరిపురంలో ఓ సిన్నోడు'' వర్ణ చిత్రానికి చక్రవర్తి సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని భాస్కరరాజు శిల్పాన్ని, బాబు కూర్పును నిర్వహిస్తారు.

''సిరిపురంలో ఓ సిన్నోడు''గా శోభన్‌బాబు నటిస్తున్న యీ వర్ణ చిత్రంలో జయసుధ, సుభాషిణి నాయిక పాత్రలను పోషిస్తున్నారు.

---

'కరుణామయుడు'లో విజయచందర్



## శారద కథానాయికగా "క్రాంతి" ప్రారంభం

శ్రీ క్రాంతి ప్రొడక్షన్స్ పేరిట ఒక నూతన చిత్ర నిర్మాణ సంస్థ వెలసింది. డిశంబరు ఆరున... యీ సంస్థ తలపెట్టిన చిత్రానికి... రికార్డింగు ముహూర్తాన్ని నిశ్చయించారు... దర్శక... కథకుడు భీమేశ్వరరావు.

చిత్రం పేరు ''క్రాంతి''. శ్రీమతి శారద ప్రధాన పాత్రధారణ గావిస్తున్న యీ ప్రయోగాత్మక చిత్రంలో నూతన కళాకారులు వివిధ భూమికలను ధరించగలరని, దర్శకుడు భీమేశ్వరరావు తెలిపారు.

ఈ చిత్రానికి సముద్రాల రచనను, మహదేవన్ సంగీతాన్ని, యోగానంద్ ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తారు.

ప్రముఖులుగా ప్రజలచేత అంగీకరింపబడిన శ్రీయుతులు విశ్వనాథ్... బాపు... వి. బి. రాజేంద్ర ప్రసాద్‌గార్ల వద్ద ''కో-డైరెక్టరు''గా ఎంతో సహకరించిన ప్రతిభావంతుడే శ్రీ భీమేశ్వరరావు.

చిత్ర విజయానికి ''కథనం'' జీవనాడి. ఆ జీవనాడిలో భీమేశ్వరరావు సిద్ధహస్తుడు.

ఒక చిత్ర నిర్మాణంలో దర్శకుడి స్థానం ఏమిటి అని అడిగాను.

''ఒక యింట్లో తండ్రి స్థానం ఎలాంటిదో... అట్టిది'' అన్నారు భీమేశ్వరరావు.

## శారదకు బలే ఛాన్సులు

రెండుసార్లు ''ఊర్వశి''ని పొందిన శారద గారిని, మన నిర్మాతలు కొంత కాలం ఎందుకు దూరంగా వుంచారో, యిప్పుడు అర్థమైంది.

కథాబలం లేని చిత్రాలలో, సెక్సుకు ప్రాధాన్యత వున్న చిత్రాలలో ఆమెను మలినం చెయ్యలేక... వూరుకున్నారేమో అనిపించింది.

మంచి చిత్రాలకు స్థానం లభిస్తున్న యీ సమయంలో... శారద వంటి వుత్తమశ్రేణి కళాకారిణి ఎంతయినా అవసరం అనేడి భావం మన నిర్మాతలకు ఏర్పడినది.

ప్రస్తుతం శారదగారికి వచ్చిన పాత్రలు ... ఆమె ప్రేక్షకులకు పరిపూర్ణ సంతృప్తిని కలిగించేవి అని ఘంటాపథంగా చెప్పొచ్చు.

కృష్ణ చిత్ర వారి ''ప్రియబాంధవి'', జయప్రద కంబైన్స్ వారి కొత్త చిత్రం, శ్రీ క్రాంతి ప్రొడక్షన్స్ వారి ''క్రాంతి'', శ్రీ బి. ఎస్. నారాయణ తీస్తున్న ''నిమజ్జనం'', శ్రీ కనకాల దేవదాస్ తలపెట్టిన కొత్త చిత్రం.

## తెలుగులో చిత్ర నిర్మాణం

కేరళ రంగంలో అయిదారు చిత్రాలను నిర్మించి ... విజయాన్ని సాధించిన 'ఊర్వశి' శారద ... మాతృభాషలో కూడా ఒక నవలా చిత్రాన్ని నిర్మించగలరని తెలిసింది.



'కేడి. నెం. 1' లో జయసుధ, ఎన్.టి.ఆర్.

## మావుళ్లయ్య చిత్రంలో దాసరి కథానాయకుడు

"స్వర్గం – నరకం" చిత్రంలో "ఆచారి"గా అందరిని ఆకర్షించి... చిత్ర విజయానికి తోడ్పడిన దర్శకుడు శ్రీ దాసరి మరో త్యంలాంటి పాత్రను ఇంటర్నేషనల్ శ్రీ లక్ష్మీనరశింహ తలపెట్టిన కొత్తతరహా సాంఘిక చిత్రంలో పోషించడం, ముదావహం.

అగ్ర దర్శకుడు శ్రీ దాసరి కథ వ్రాసి, చిత్రానువాదం సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్న శ్రీ లక్ష్మీనరశింహా ఎంటర్‌ప్రైజస్‌లో ఆయన ప్రధాన పాత్ర పోషించడానికి, నిర్మాత శ్రీ మావుళ్లయ్య చెప్పిన కారణం యిది.

'లక్ష్మి పూజ'లో జయమాలిని



"కథ విన్న తరువాత... ప్రధాన పాత్రకు శ్రీ దాసరి మాత్రమే న్యాయం చేకూర్చగలరనిపించింది. పట్టుబట్టి, ఆయన్ను వొప్పించడం జరిగింది" అన్నారు నిర్మాత మావుళ్లయ్య.

శ్రీ దాసరి ప్రధాన పాత్రను పోషిస్తున్న చిత్రానికి "పెద్దిల్లు...చిన్నిల్లు" అని పేరు పెట్టినట్టు, డిశంబరు 9న షూటింగు తలపెట్టినట్టు, నిర్మాత మావుళ్లయ్య తెలిపారు.

ఈ వర్ణచిత్రంలో ప్రభ, దీప, మోహన్‌బాబు, మాడా, కె. వి. చలం ముఖ్య పాత్రధారులు. శ్రీ దాసరితో కె. ఎస్. మణి, బాలు, భాస్కరరాజు, సత్యం, అన్నారావు సాంకేతిక శాఖలను నిర్వహిస్తున్నారు.

## రామూ! గెలుపు నీదే

మకుటాన్ని చదువుతుంటేనే ఒకరకమైన ఉత్తేజం పుదుతూందికదూ. ఈ మకుటాన్ని పెట్టింది ప్రజాదర్శకుడు శ్రీ దాసరి నారాయణ రావు. పై పేరు గల చిత్రాన్ని నిర్మిస్తున్నది రవీంద్రా ఫిలింస్. శ్రీ రావుల అంకయ్యగౌడ్, శ్రీ చిత్తూరు ఆనందనాయుడు ఈ సంస్థకు అధిపతులు వీరిరువురు తమ తొలి కానుకగా "రామూ! గెలుపు నీదే" అనే సెంటిమెంటల్ క్రైమ్ చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయించి, నవంబర్‌లో షూటింగ్ జరిపి, డిశంబర్‌కు ఫస్టు ప్రింటును రెడీచేసి; అదే నెలలోనే విడుదల చేయడానికి సన్నాహాలు పూర్తిచేశారు. ఏ గ్రేట్ అఛీవ్‌మెంట్.

"పాడిపంటలు పున్నమ్మ" ఫేం ఆర్. త్యాగరాజన్ దర్శకత్వంలో తయారైన ఈ చిత్రంలో "రామూ" (కుక్క) ఎన్నో వింతలు చేసింది, మరెన్నో విచిత్రాలు చూపెట్టింది. "రామూ" తెరమీద కన్పించినంతసేపు ప్రేక్షకుల దృష్టి మరొకవైపు మరలడానికి వీల్లేదు, అంతే అంత చలాకీగా నటించింది రామూ; అనేగా అర్థం. మాస్‌ను ఆకర్షించడానికి రజనీకాంత్, మోహన్‌బాబుల భయంకర పోరాటాలు, హుషారుగొలిపే జయమాలిని నాట్యభంగిమలు వున్నాయి. యువహృదయాలను అయస్కాంతంలా ఆకర్షించే రజనీ, శ్రీప్రియల ప్రేమాయణం వుంది. రసహృదయులకు రసస్పందన కలిగించే స,రి,గ,మ,ల సరాగాలు వున్నాయి ఈ చిత్రంలో. పెద్ద కమర్షియల్ అస్సెట్టుగా "కుక్క" వుండనేవుంది.

రవీంద్రా ఫిలింస్ సమర్పణలో దండాయుధపాణి ఫిలింస్ నిర్మించిన ఈ కౌబాయ్ చిత్రానికి రామ్మూర్తి కెమెరా, శంకర్ – గణేష్ సంగీతం సమకూర్చారు.

## ప్రభ, మురళీలకు ఆత్రేయ వలపుపాట

పాత్రలోకి జొరబడి (తాననుభవించినట్టుగా) పాడ్తారు ఘంటసాల. పాత్రలోకి చొచ్చుకుని (తనే నటిస్తున్నట్టుగా) వ్రాస్తారు ఆత్రేయ. "అందుకే ఘంటసాలకు సరిలేరు మరెవ్వరూ. ఆత్రేయకు సాటిరారు వేరెవ్వరూ" అంటుంటారు. ఆవేదనను ఎంత కటువుగా వ్రాస్తాడో, ఆహ్లాదాన్ని అంత సులువుగా వ్రాస్తారు ఆత్రేయ.

శ్రీ దాసరి నారాయణరావు "మాటలు, స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో శ్రీ లలితా ఎంటర్‌ప్రైజస్ నిర్మిస్తున్న "కోరికలే గుర్రాలయితే?" వర్ణ చిత్రంలో ప్రభ, మురళీ మోహన్‌ల కోసం ఓ వలపు పాటను వ్రాశారు ఆత్రేయ. ఆ పాట పల్లవేమిటో పరికిద్దాం."

"మనసే మన ఆకాశం
మనమే రవి చంద్రులం
ఇటు రేయి అటు పగలు
ఒకటై వెలిగే ప్రేమికులం" అంటూ

ఆ జంట ఊహాగానాల్లో తేలిపోతుంటే, వారి పారవశ్యాన్ని తనివితీరా చూసి ఆనందించాడట ఆ తిరుపతిదేవుడు. తిరుపతిదేవుడు ఎక్కడ్నుంచి వచ్చాడు అని మీరు అడుగుతారు. ప్రభ, మురళీమోహన్‌ల ప్రేమాయణం సాగింది ఆ తిరుపతిలోనే. ఏకాంతంలో విహరించే జంటను ఆ ఏడుకొండలవాడు చూడక ఇంకెవ్వరు చూస్తారు!

శ్రీ జగదీష్‌చంద్రప్రసాద్ నిర్మిస్తున్న ఈ వర్ణ చిత్రంలో చంద్రమోహన్, జయలక్ష్మి మరొక జంటగా, మోహన్‌బాబు, రమాప్రభ వేరొక జంటగా, జయమాలిని, కాంతారావు, నిర్మల తదితర ముఖ్య పాత్రధారులుగా నటిస్తున్నారు. డిశంబర్‌లో అన్నపూర్ణా ద్వారా విడుదలయ్యే ఈ చిత్రానికి సత్యం సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, భాస్కరరాజు కళను, బాలు కూర్పును, దుర్గానాగేశ్వరరావు కో – డైరెక్షన్ను, కోడి రామకృష్ణ సహకార దర్శకత్వమును, రమేష్‌చంద్రప్రసాద్ నిర్వహణను నిర్వహిస్తున్నారు.

## కొమ్మినేని చిత్రానికి మంచి "టాక్"

''దేవతలారా! దీవించండి'' కొమ్మినేని శేషగిరిరావు మొదటి చిత్రము మరియు మరపురాని చిత్రము. న్యాయంగా ఆలోచిస్తే, ఆ చిత్రం అంత విజయాన్ని సాధించినందుకు, కొమ్మినేనికి అప్పుడే బోలెడన్ని ఆఫర్లు వచ్చుండాలి. కానీ అలా జరుగలేదు. గిరిబాబు ''సింహగర్జనే'' అతని రెండవ చిత్రం అయింది. ''సింహగర్జన'' కలెక్షన్స్ విషయంలో వెనకడుగువేసినమాట వాస్తవమే అయినా, నెరేషన్ విషయంలో ముందడుగు వేసిందనే చెప్పాలి. ''సింహగర్జన'' కథ గిరిబాబుదే అయినా, దానిని కొమ్మినేని నడిపించిన విధానం ప్రశంసనీయం. కొమ్మినేనిలో కూడా ఏ మూలనో రచయిత దాగున్నాడు. అందుకేకామోసు ఈమధ్య చాలామంది కొమ్మినేనిని కోరుకుంటున్నారు. కొమ్మినేని దర్శకత్వంలో పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్ నిర్మించిన కామెడీ ఎంటర్‌టెయినర్ ''తాయారమ్మ - బంగారయ్య'' చిత్రానికి పరిశ్రమలో గుడ్ టాక్ వచ్చింది. సత్యనారాయణ, జానకి ఎంటర్ అయిందగ్గర్నుంచి ప్రతి ఫ్రేము ఇంటరెస్టింగ్‌గా వుందని పల్వురు కాంప్లిమెంట్ చేస్తున్నారు.

పింజల సుబ్బారావుగారి ''లక్ష్మీపూజ'' జానపద వర్ణ చిత్రాన్ని పూర్తిచేసే బాధ్యతల్లో నిమగ్నమై వున్న కొమ్మినేని శేషగిరిరావుకు రెండు కొత్త చిత్రాలు వచ్చాయి. హేమ ఆర్ట్ ఫిలింస్ బ్యానరుపై కె. రామచంద్రరావు నిర్మిస్తున్న ''చేయెత్తి జైకొట్టు'' చిత్రానికి, వాశిరాజు ప్రకాశం నిర్మిస్తున్న ''బొమ్మల కొలువు'' చిత్రానికి కొమ్మినేని దర్శకత్వం వహిస్తున్నారు. మొదటి చిత్రంలో కృష్ణంరాజు, గీత ముఖ్య పాత్రధారులు.

## డిశంబర్ 1కి ఫస్టు ప్రింటు

జనవరిలో విడుదల చేయాలని వుద్దేశ్యం అన్నారు ''కలియుగ మహాభారతం'' చిత్ర రథసారథి హనుమాన్‌ప్రసాద్. సన్నగా, పొడుగ్గా, గెడ్డంతో ఎప్పుడూ నవ్వుతూ కన్పించే హనుమాన్ ప్రసాద్ విట్టీగా ఓ మాటన్నారు ఇటీవల.

''మనకు ఫ్యాన్ వుండి ఏం లాభం బ్రదర్. బ్యాంకుల్లో బాలెన్సులు వుండాలిగానీ'' అని. ఆ మాట నిజమే మరి. ప్రసాద్‌గారు తీసిన ''దేవుడు చేసిన బొమ్మలు'' చిత్రానికి ఏం తక్కువ? కానీ ఆశించినంత సంతృప్తి నివ్వలేదు (ఆర్థికంగా) ఆ చిత్రం. ఆ చిత్ర కథను ఎంతో బాగా నడిపించారు ప్రసాద్‌గారు. కానీ ప్రేక్షకులు ఆ చిత్రాన్ని ఎక్కువ రోజులు నడిపించలేక పోయారే! కాలం ఇలా వున్నపుడు వారన్నట్టు ఫ్యాన్ వుండి క్యాష్ లేకపోతే ఏం ప్రయోజనం?

విప్లవాత్మకమైన భావాలతో, సంఘంలో నేడు జరుగుతున్న అన్యాయాలను సినిమా మీడియా ద్వారా ప్రజలకు చెప్పాలనేదే హనుమాన్‌ప్రసాద్ తాపత్రయం. శ్రీ పరుచూరి కథ, మాటలు వ్రాసిన ''కలియుగ మహాభారతం'' చిత్రంలో తన తాపత్రయానికొక చక్కటి రూపాన్ని, ప్రాణాన్ని సృష్టించారని చెప్పడానికి ఈ కలం ఆనందిస్తూంది. సినిమా చూశాక ఒకటే మాటన్నాను ప్రసాద్‌గారితో. ''కీపిటప్ సార్. వెల్‌డన్'' అని అభినందించకుండా వుండలేక పోయాను. లోకోభిన్నరుచి: నా అభిప్రాయం నాది.

— శ్రీనివాస్

'రావణుడే రాముడైతే'లో ఏ. ఎన్. ఆర్., మురళీమోహన్





'అంతులేని వింత కథ'లో సత్యనారాయణ, మంజుభార్గవి

# జి. వి. జి. పేజీ

## నామాల తాతయ్యకు వుత్తరం

మంగాపురం తపాలా ఆఫీసులో విలేజ్ పోస్ట్‌మన్ ఏడుకొండలు (రాజ్‌బాబు) ఉత్తరాల మీద అదే పనిగా ముద్రలు వేసేస్తున్నాడు. మధ్యలో ఒక కాగితం అతని స్పీడుకు బ్రేక్ వేసింది. ఆ కాగితాన్ని చేతిలోకి తీసుకొని, "అరే! కార్డూ కాదు; కవరూ కాదు. పైగా స్టాంపు లేదు. ఏమే, నీక్కూడా నేను లోకువై పోయానా? ఓ కవరులేని కాగితమా! నీకు నేను ముద్దరెయ్యను. గాల్లోకి విసురుతాను. ఎక్కడికి పోతావో పో!" అంటూ విసిరేశాడు. అప్పుడే అటుకేసి వస్తున్న పోస్ట్‌మాస్టర్ కూతురు చిన్నమ్మ (మాధవి) కాళ్ల దగ్గర పడిందా కాగితం. "ఏమిటీ కాగితం? ఇలా పారేశావేం?" అంది చిన్నమ్మ.

"కాగితం కాబట్టే పారేశానండి. కార్డుల మీదా, కవర్ల మీదా ముద్రలెయ్యడానికే నాకు ఓపిక సరిపోడం లేదు. ఇంకా ఈ కాగితాల మీద కూడా ముద్దర్లు కొట్టాలా?" అని విసుక్కున్నాడు ఏడుకొండలు.

"నామాల తాతయ్యకి...తిరపతి" అని ఉన్న అడ్రసు ఆమెలో కుతూహలాన్ని కలిగించింది. కాగితం మడత విప్పి, చదవసాగింది. "నామాల తాతయ్యకి...మా అమ్మ నీ దగ్గరుందని వెంకన్న చెప్పాడు. వెంటనే అమ్మని పంపించు. అందరు పిల్లలకీ వాళ్ళమ్మలే బువ్వలు పెడుతున్నారు. నాక్కూడా అమ్మ చేత్తో బువ్వ తినాలని ఉంది. పైగా, మా బళ్ళో అందరికీ అమ్మలున్నారు. నాఒక్క దానికే లేదు అందుకని ఎగతాళిచేస్తున్నారు. చూడు, తాతయ్యా! మరేమో! నేను పుట్టిన తర్వాత ఇప్పటిదాకా మా అమ్మని ఒక్కసారి కూడా చూడలేదు. అందుకే ఈ ఉత్తరం అందగానే మా అమ్మని పంపించెయ్యి. పంపిస్తే నీకు ముద్దులు పెడతాను...ఇట్లు—మనవరాలు ... జ్యోతి". ఆ ఉత్తరం ఆమె హృదయాన్ని ద్రవింపజేసింది. ఎవరీ జ్యోతి అని అడిగింది.

"మన ప్రెసిడెంటు శ్రీనివాసరావుగారు లేరూ - వారి అమ్మాయండి. ఆ అమ్మాయి అమ్మగారు దేవతలాంటి వారండి. ఆ దేవుడికి మంచివాళ్ళంటే ఎంత ఇష్టమో తెలుసాండీ? టెలిగ్రామ్ కంటే అర్జంటుగా తీసుకెళ్ళిపోతాడండి ఆయన..." అంటున్న ఏడుకొండలు, చిన్నమ్మ వంక తేరిపార చూసి, "ఏమిటండీ, మరీ అంత బరువుగా ఆలోచిస్తున్నారు?" అన్నాడు.

"నామాల తాతయ్య దగ్గర వీళ్ళ అమ్మ ఉందని ఈ అమ్మాయి భ్రమపడుతోంది కదా? కాబట్టి నామాల తాతయ్య రాసినట్టు ఒక ఉత్తరం మనమే రాస్తే —?" అంది చిన్నమ్మ.

"రాయండి. ఆ ఉత్తరం చూడగానే జ్యోతి పాప — వాళ్ళమ్మన్ని చూసినట్టే సంబరపడుతుంది." అన్నాడు ఏడుకొండలు.

ఉత్తరం రాసే స్థిర నిశ్చయంతో చిన్నమ్మ లోనికి వెళ్ళిపోయింది.

స్టైఫ్ ఎంటర్ ప్రైజెస్ "నామాల తాతయ్య"లో ఇది కీలక సన్నివేశం. జ్యోతిగా బేబీ దుర్గ, ఆమె తండ్రి శ్రీనివాసరావుగా రంగనాథ్, తల్లిగా జయ నటించారు.

ఈ వర్ణ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకుడు. రాజా శివానంద్ సంభాషణలకర్త. ఎస్. రాజేశ్వరరావు స్వరాలకర్త.

## రాఖీ విస్మయం

ఇటీవల హిందీ నటి రాఖీ ఏదో ఔట్‌డోర్ షూటింగ్ సందర్భంలో పూనా వెళ్ళింది. ఒకరోజు కాస్త తీరుబడి దొరికితే, చీరలు కొనడానికి ఓ షాపుకు వెళ్ళింది. ఆ కొట్టు బయట "నటీమణి రాఖీ 'త్రిశూల్' చిత్రంలో ధరించిన ఫాషన్ చీరలు ఇక్కడ అమ్మబడును" అని వున్న బోర్డు చూసి చకితురాలై, లోపలికెళ్ళి ఆ చీరలు చూపించమని అడిగింది. కొట్టులోనివారు రెండు చీరలు చూపిస్తే, "హాట్టి దగా! అసలు నేనిలాంటి చీరలను 'త్రిశూల్'లో కట్టుకోనేలేదు. సాధారణంగా నేను ఒక చీరకున్న బార్డర్‌ను తీసేసి, ఇంకో చీర బార్డర్‌ను చేర్చి కుట్టి ధరిస్తూంటాను. అటువంటప్పుడు మీరిలా నా పేరు చెప్పి ప్రజలను మోసగించడం ఏం బాగోలేదు," అందట.

'ఊర్వశీ నీవే నా ప్రేయసీ'లో సుభాషిణి, లత



## స్త్రీ మనోభావాలకు అందమైన, భాషలు ఎన్నెన్నో!

## అందులో విమల్ ఒకటి.




100% పాలియెస్టర్ చీరలు.

మీ విమల్ రిటెయిల్ షాపులో వీటికోసం అడగండి: సారికా, రంగోలి, డివైన్ జ్యూయల్, పాలియెస్టర్ టిస్యూ క్రేప్, నిట్ గజ్జీ, గజ్జీ సిల్క్ మరియు ఫ్రెంచ్ షిఫాన్ చీరలు

# జి. వి. జి. పేజీ



'రామబాణం'లో శోభన్‌బాబు, జయప్రద

## రామబాణంలో
## కాబోయే పెళ్ళికొడుకు

కృష్ణ (శోభన్‌బాబు) మోటార్‌బైక్ మీద రివ్వున వస్తుంటే జెట్టి (నాగేష్) "స్టాప్! స్టాప్!" అంటూ చేతులు ఊపి ఆపి, "నీ పెళ్లికి లైన్ క్లియర్!" అన్నాడు.

"పెళ్లి మాట దేవుడెరుగు. ముందీ పిస్టల్ సంగతి తేల్చుకోవాలి," అంటూ కృష్ణ జేబులోంచి కె. కె. వదలివెళ్లిన పిస్టల్ చూపిస్తూ, "మా పెరట్లో దొరికింది. లోడ్‌చేసిన పిస్టల్. గోడ దగ్గర పడివున్నదంటే—" అంటూ ఆగాడు.

"—గండం వెంట్రుకవాసిలో తప్పిందని అర్థం. ఉండు. ఈ విషయం ఇప్పుడే భూషణం గారితో చెప్పి, కాబోయే పెళ్ళికొడుక్కి గట్టి కాపలా ఏర్పాటు చేయిస్తాను," అన్నాడు జెట్టి

"జెట్టీ! భూషణం నువ్వనుకునేంత మంచివాడేంకాదు. ఆర్. కె. గుడారానికి అతనొక అందమైన గేటు. అందుకే అతనిమీద కూడా ఒక కన్నేసి వుంచాను," అన్నాడు కృష్ణ.

కౌముదీవారి "రామబాణం" వర్ణ చిత్రానికి కథను భీశెట్టి, జయంపు కృష్ణ రాశారు. చిత్రానువాదం, మాటలు, పాటలు: మల్లెమాల. దర్శకత్వం: ఈశ్వరరెడ్డి. నిర్మాత: ఎం.ఎస్.రెడ్డి.

## ఇద్దరూ అసాధ్యులే లో
## ఉడతల్ని పట్టే చలపతి

లైసెన్స్‌డ్ ఫారెస్ట్ హంటర్ ప్రకాష్ (కృష్ణ) తన గెస్ట్ హౌస్ నుండి బయటకొచ్చి జీప్ ఎక్కబోతూండగా పగటివేషపు దుస్తులలో చలపతి (చలం) పరుగున వచ్చాడు. "గురూ! గురూ! కాస్తాగు, గురూ!" అంటూ.

"ఎవర్నువ్?" ప్రకాష్ అడిగాడు.

"నేను చలపతిని. హేమ బానను. తిరపతయ్య మేనల్లుడ్ని ... గురూ, నీదగ్గర ఒక పాత వల వుంటే ఇప్పించు, గురూ!"

"ఎందుకు?"

"ఉడతల్ని పట్టేందుకు."

"నాదగ్గరుండే వలలు పులుల్ని, చిఱుతల్ని పట్టేందుకయ్యా."

"నువ్వు హీరోవి గనక పులుల్ని పడ్తావ్. నేను జీరోని గనక ఉడతల్ని పడ్తాను."

"అయినా కుదరదయ్యా!"

"ఎందుకు కుదరదు? ఉడతల్ని యెలా పట్టాలో నాకు తెలుసు. ముందు వల ఇప్పించండి. మిగతా పని నే చూసుకుంటాను," అంటూ వల తీసుకున్నాడు చలపతి.

షాట్ ఓ—కే అయ్యాక "ఆ వలలో చలం పడే పాట్లు కడుపుబ్బ నవ్విస్తాయి," అని తెలియజేశారు డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్. స్కోప్ కలర్‌లో జి. డి. ప్రసాదరావు, పి. శశిభూషణ్ భాగీయెత్తున నిర్మించే శ్రీ సారథీ స్టూడియోస్ "ఇద్దరూ అసాధ్యులే" చిత్రం చివరి ఘట్టంలో పడింది. మహారథి రచన, సత్యం సంగీతం, ఎస్. ఎస్. లాల్ ఛాయ, వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు.

## "పునాదిరాళ్ళు" లో
## అనసూయ అవస్థ

సర్పంచ్ (గోకినరామారావు) దభీమని తలుపు మూశాడు. భార్య అనసూయ (సావిత్రి) తృళ్ళిపడి లేచి, "ఏమిటండీ అర్ధరాత్రి ఈ అంకమ్మ శివాలూ? ఎందుకలా ఉన్నారు?" అంది.

"నీ కొడుకు చేసిన నిర్వాకం. ఇల్లొదిలి వెళ్లిపోయాడు. ఆ లేబరు వాళ్ళతో కలసి నా అంతు తేలుస్తాడట. అదేమిటో నేనూ చూస్తాను."

"ఏమిటండీ! ఎంత చెడ్డా వాడు కన్నబిడ్డ. ఒక్కగానొక్కడు. మీరూరుకోండి. నే వెళ్లి తీసుకొస్తాను."

"వీల్లేదు వాడంతట వాడే వచ్చి, తప్పు చేశానని నా కాళ్ళమీద పడాలి. అంతవరకూ వాడు నా కొడుకే కాదు ... చచ్చాడనుకుంటాను."

"అబ్బ! ఏం మాటలండి? మీరుండండి. నేను తీసుకొస్తాను."

"చూడు! ముందే చెప్పాను. భర్త కావాలో, కొడుకే కావాలో తేల్చుకొని మరీ కాలు బయట పెట్టు."

అనసూయ అలాగే స్తంభించిపోయింది.

పూర్తిగా రాజమండ్రి పరిసరాలలో చిత్రీకరించబడిన ధర్మవిజయా పిక్చర్స్ "పునాదిరాళ్ళు" ఆర్వో కలర్ చిత్రానికి ఫజులుల్లాహక్ నిర్మాత. నివాస్ ఛాయాగ్రాహకుడు. ప్రేమ్‌జీ సంగీత దర్శకుడు. పాటలు, దర్శకత్వం: రాజకుమార్ గూడపాటి.



'హేమాహేమీలు'లో కృష్ణ, గుమ్మడి, జరీనా

శ్యాంప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# ప్రేమపూజారి

మరియు





'కోరికలే గుర్రాలైతే'లో
చంద్రమోహన్, జయలక్ష్మి

## సిని రచయితలకు పారితోషికాలు

"ఎక్సార్సిస్ట్స్" చిత్ర కథకునికి ఇంతవరకు 13 కోట్ల డాలర్లు రాయల్టీగా లభించింది. తనకింకా ఎక్కువ మొత్తం చెందాలనీ, వార్నర్ బ్రదర్స్ సంస్థ తప్పు లెక్కలు చూపించిందనీ అతను ఆరోపించాడు. ఏదో పొరబాటు జరిగి ఉంటుంది — అంటూ ఆ సంస్థ మరో 88 లక్షలు చెల్లించడానికి నిశ్చయించింది.

ఆ రోజుల్లో కలకత్తాలోని న్యూ థియేటర్స్ సంస్థ కిదార్ శర్మ రాసిన ఒక కథకు 100 రూపాయలు, పాటకు 5 రూపాయల చొప్పున చెల్లించింది.

స్వర్గీయ కెన్నెడీ భార్య — ఇప్పటి జాక్విలిన్ ఒనాసిస్, కొలంబియా పిక్చర్స్ వారి ఒక చిత్రానికి కథ, మాటలు రాస్తోంది.

'బంగారు బాట'లో వసంత



## * జి. వి. జి. పేజీ *

### తెలుగులో 'డాన్'

"హిందీ హిట్ పిక్చర్ 'డాన్' ఆధారంగా జూన్ ఫస్ట్ నించి కొత్త వర్ణ చిత్రాన్ని కె.ఎస్.ఆర్. దాస్ దర్శకత్వంలో ప్రారంభిస్తాను. రామారావుగారి సరసన నాయికగా శ్రీప్రియను బుక్ చేయాలనుకుంటున్నాం," అన్నారు నిర్మాత ఎం. పీతాంబరం. సత్యానంద్ రచయిత, ఇళయరాజా సంగీత దర్శకుడు. ఎం. సి. శేఖర్ ఛాయాగ్రాహకుడు. గజలక్ష్మి చిత్ర పతాకంలో తయారౌతుంది. ఇప్పుడు పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పీతాంబరం నిర్మిస్తున్న విజయకళ ఆర్ట్స్ వర్ణ చిత్రం "పంచభూతాలు" ఆరు రీళ్ళకు పైగా తయారైంది. చంద్రమోహన్, రావుగోపాలరావు, శరత్‌బాబు, త్యాగరాజు, సారధి, కె. కె. శర్మ, పొట్టిప్రసాద్, భీమరాజు, సి. హెచ్. కృష్ణమూర్తి, లత, అనిత, లక్ష్మి, కొత్త నటుడు గోపీకృష్ణ పాల్గొంటున్నారు. మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త. మన్నె రాధాకృష్ణ సహకార దర్శకుడు.

### పదకొండు చిత్రాలు!

1945 లో తమిళంలో 11 చిత్రాలే తయారయ్యాయి. ఈ ఏడు ఒక్క దీపావళి రోజునే 11 తమిళ చిత్రాలు విడుదలయ్యాయి.

## సంక్షిప్త చిత్ర వార్తలు

★ త్రిమూర్తి కంబైన్స్ తొలి వర్ణ చిత్రంలో కృష్ణ, జయప్రద, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, నాగభూషణం, అల్లురామలింగయ్య, పద్మనాభం, ప్రసాద్‌బాబు, జయమోహన్ నటవర్గం. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో పి. బాబ్జి, యు. సూర్యనారాయణ బాబు నిర్మించే ఈ చిత్రానికి భమిడిపాటి రచయిత. ఆత్రేయ, కొసరాజు, ఆరుద్ర, వేటూరి గీతాలకు సత్యం స్వరకల్పన చేస్తారు. జయదేవ్, ప్రసాద్ సహ దర్శకులు. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, ఎస్. ఎస్. ప్రకాశం — డి. వెంకటరత్నం కూర్పు, ఎస్. కృష్ణారావు శిల్పం ఇతర ఆకర్షణలు.

★ ఎస్. డి. లాల్ దర్శకత్వంలో మోహన్‌బాబు, సుభాషిణి, హలం, మంజుభార్గవి, విజయలక్ష్మి పాల్గొంటున్న ఆర్. డబ్ల్యు. మూవీస్ వారి చిత్రానికి "అమ్మాయి కావాలి" అని పేరు పెట్టారు.

★ ఉదయలక్ష్మి ఎంటర్‌ప్రైసెస్ వారి చిత్రం "సీత పుట్టింది రాముడికోసమే" పేరును "ఇల్లాలి ముచ్చట్లు"గా మార్చారు.

★ యు. సూర్యనారాయణబాబు శ్రీ పద్మావతీ ఇంటర్నేషనల్ పతాకంలో నిర్మించే చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు. శ్రీధర్, మురళీమోహన్, సుభాషిణి ముఖ్యభూమికలు నిర్వహిస్తారు. జంధ్యాల రచయిత. సంగీతం, ఛాయ, శిల్పం, కూర్పు శాఖలను జె. వి. రాఘవులు, రఘు, రామలింగేశ్వరరావు, కోటగిరి గోపాలరావు నిర్వహిస్తారు. ఫిబ్రవరి 15 నించి మార్చి 20 వరకు విజయవాడలో జరిగే ఒకే షెడ్యూల్‌తో చిత్ర నిర్మాణం పూర్తవుతుంది. నిర్వహణ : కె. ఎస్. రామారావు.

★ డిసెంబర్ 29న విడుదలయ్యే "ఎంకి—నాయుడుబావ" సినిమాస్కోప్ కలర్ చిత్రానికి ఇటీవల మైసూరు సమీపాన గల బృందావనం, మద్దూరు, మాండ్య ప్రాంతాలలో కొన్ని పాటలు చిత్రీకరించబడ్డాయి. జనవరిలో డి. రామానాయుడు ప్రారంభించే చిత్రంలో శోభన్‌బాబు, కృష్ణ హీరోలు. బాపయ్య దర్శకుడు. ఆ తర్వాత కె.వాసు దర్శకత్వంలో కూడా ఒక చిత్రాన్ని నిర్మిస్తారు.

★ కళాకేంద్ర మూవీస్ పతాకంలో గోవిందరాజన్, దొరైస్వామి రెండు చిత్రాలను కె. బాలచందర్ దర్శకత్వంలో నిర్మిస్తున్నారు. "మనిషికి మరోవైపు" చిత్రంలో రజనీకాంత్ (ద్విపాత్రాభినయం), గీత, వై. విజయ, వెన్నిరాడై నిర్మల, పాత్రధారులు. మరో చిత్రం "గుప్పెడు మనసు" మూడువంతులకు పైగా పూర్తయింది.



'కమలమ్మ కమతం'లో జయంతి, కృష్ణంరాజు

★ ఊర్మిళా పిక్చర్స్ పతాకంలో డాక్టర్ ఎం. బాబూరావు "తల్లి దీవెన" అనే చిత్రాన్ని జి. విజయరత్నం కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో నిర్మిస్తున్నారు. ప్రసాద్‌బాబు, ఈశ్వరరావు, రాళ్ళపల్లి, పల్లవి, అభిలాష, విజయలక్ష్మి, బేబీరోహిణి, కె. కె. శర్మ వగైరా తారాగణం. బి. శంకర్ సంగీత దర్శకుడు. ఎన్. ఆర్. కె. మూర్తి ఛాయాగ్రాహకుడు.

# పెరుగుతున్న సంవత్సరాలు

# కాల్షియం-శాండోజ్ సంవత్సరాలు





పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి$^{12}$తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

కాల్షియం-శాండోజ్
స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్
వారు రూపొందించినది,
ప్రపంచంలోని
అత్యుత్తమమైన కాల్షియం.




## కాల్షియం-శాండోజ్®

## గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/26 TEL

# ఆకర్షణ - వ్యామోహం

[24వ పేజీ తరువాయి]

షీల కొంచెం లూజ్‌గా వున్న కమీజ్, షెల్వార్ వేసుకొంది. ఆ కమీజ్ కాస్త పలచగా వుంది. వాళ్లకిగూడా గ్లాసుల్లో పోర్సు వేసి యిచ్చాడు.

టి. వి. లో ఝూన్సీకిరాణి చూపిస్తున్నారు. ఏమీ చూపించటానికి లేనప్పుడల్లా ఆ సినిమా వేస్తూవుంటారు అక్కడ. పార్వతి ఉత్సాహంగా చూస్తోంది. కృష్ణ తన చెయిర్ పార్వతికి తగిలేలా జరుపుకొన్నాడు. తన్ని షీలని ఇగ్నోర్‌చేసి కృష్ణ పార్వతితో మాట్లాడుతున్నాడు. ఇంతకుపూర్వంకూడా కృష్ణ అల్లా చేసాడు. అమాటే పార్వతితో అంటే ''అతనిలో కొంచెం చురుకుపాలెక్కువ. మీరేమో పరాయి ఆడవాళ్లతో మాట్లాడటానికి బిగుసుకుపోతారు. ఆ మాటకి వస్తే షీల కూడా నాకంటే ఫ్రీగానే వుంటుంది. మనం తెలుగువాళ్లం కాస్త రిజర్వ్‌డ్'' అంది పార్వతి.

కృష్ణ చాలా ఫ్రీగా మాట్లాడుతుంటే, పార్వతి క్రమేపి బెరుకు వదిలి ఫ్రీగా మాట్లాడ గలుగుతోంది. అతను వాళ్ల కాలేజీలో ఆడపిల్లల్ని ఎల్లా అల్లరిపెట్టేవాడో చెప్పి నవ్విస్తాడు. లేక తన చిలిపిపనులు కథలకింద చెప్తూవుంటాడు. పార్వతికి కృష్ణతో కబుర్లు చెప్పటం యిష్టం.

షీల పెద్దగా శంకరరావుని పట్టించుకోదు షీలను శంకరరావు ఏ విధంగాను ఇంప్రెస్ చెయ్యలేదు. శంకరరావు గురించి మంచివాడు మందబుద్ధిను అనుకొంటుంది. మంచివాళ్లపట్ల గౌరవమే కాని గ్లామర్ ఉండదు. గ్లామర్ అంతా కృష్ణుడిదే! శంకరుడికి మంచి పేరు మాత్రమే! శంకరరావు ఆ రోజు తన కొత్త జీవితాన్ని ప్రారంభించటానికి, కృష్ణకి షాక్ ఇవ్వటానికి సిద్ధపడ్డాడు. అందుకని గట్టిగా,

''ఏమిటివ్వాళ ? నీ పుట్టిన రోజా షీలా ?'' అని అడిగాడు.

''కాదు. ఏం ?'' అంది ఆశ్చర్యపోతూ షీల.

''చాలా శ్రద్ధగా, అందంగా తయారైతేను.''

''ఇవ్వాళ ప్రత్యేకత ఏమీలేదే !''

పార్వతి కృష్ణతో మాట్లాడటం ఆపి ఈ సంభాషణ వింటోంది, ఇవాళ ఈయనేమిటి? ఇల్లా మాట్లాడుతున్నారని ఆశ్చర్యపోతూ.

''అయితే నువ్వు రోజూ ఇంత అందంగాను డ్రెస్సవుతావని నేనే గమనించలేదని అంటావన్న మాట. భలేదానివే.''

''అంతేమరి'' అంది షీల నవ్వుతూ. షీల కాంప్లిమెంట్సంటే పడిచస్తుంది. ఈ విషయం పార్వతికి తెలుసు. శంకరరావుకి తెలియదు.

కృష్ణ కాస్సేపిబ్బందిగా కదిలి ఓ అరగం టున్నాక, ''ఈ సినిమా యమ బోరుకొడ్తోంది. మనం పోదాం వాళ్లు చూస్తారనుకొంటాను'' అన్నాడు.

''ఫరవాలేదు ఆపేస్తాం'' అన్నాడు శంకరరావు ఉత్సాహంగా.

''నేను చూస్తాను. నేను మన దేశంలో కూడా ఈ సినిమా చూడలేదు'' అంది పార్వతి.

''పోనీ ఈ దేశంలో రెండోసారి కదా!'' అన్నాడు శంకరరావు. పార్వతి జవాబు చెప్పలేదు.

''మేం వెళ్తాం'' అని కృష్ణ, షీలను బయల్దేరదీసాడు.

కృష్ణ, షీల వెళ్లిపోయాక పార్వతి టి. వి. కట్టేసింది.

''అదేమిటి, ఆ సినిమా చూస్తానన్నావుగా?'' అని అడిగాడు శంకరరావు.

''చూడాలని అనిపించలేదు.''

''అప్పుడే ఆపేస్తే కృష్ణ, షీల మరికాస్సేపు కూర్చుందురుకదా ?''

''కూర్చుంటే మీరు కొత్తగా గమనించిన ఆవిడ అందాలు మరికాస్సేపు చూసేవారుకదా !''

''నువ్వేకదా పార్వతి అన్నావ్ ఆడవాళ్లు కాంప్లిమెంట్స్ లైక్ చేస్తారని.''



'ప్రియబాంధవి'లో శారద

''అన్నాను. అంటే మీరు నాకివ్వాలని అన్నాను.''

''నేను కాక మరొకరిచ్చినా అంతే రుచిగా వుంటాయికదా? నువ్వితర్ల నుంచి పుచ్చుకోడానికి, పుచ్చుకొని ఆనందించడానికిలేని అభ్యంతరం నే నితర్లకిస్తే ఎందుకు ?''

''నేనెవరికైనా ఇస్తున్నానా ? మీకు గూడా ఎవరైనా యిస్తే పుచ్చుకోండి !''

''అదెల్లా. ఆడవాళ్లకి కాంప్లిమెంట్స్ పుచ్చుకోడం మగవారి కివ్వడం సహజం. అదిసరే నువ్వు అంతలో కట్‌జాకెట్లు, బొడ్డు కిందకి చీరలు ఎందుకు కడ్తావ్ ?''

''అదిప్పటి ఫాషన్. అందరు ఆడవాళ్లు కడ్తున్నారు నేను కడ్తున్నాను. ఇతర్లు కట్టగా మీరు కన్నులపండగ చేసుకోడంలేదూ ! నేను కట్టుకొంటే మీకెందుకు బాధ ? అయినా దీనికి దానికి సంబంధం ఏమిటి ?''

''చెప్తాను. మిగతా ఆడవాళ్లలాగే నువ్వు డ్రెస్సవాలని అనుకోడం సహజం. ఎందుకు ? నేనితర్ల ఆకర్షణలో పడిపోకుండాను, ఇతర ఆడవాళ్లని బెదిరించడానికీను. మీరు మావార్ని ఆకర్షిస్తే జాగ్రత్త అదే పని నేను చెయ్యగలను సుమా! అని అల్లాగే నువ్వు పరాయి మగాళ్లిచ్చే కాంప్లిమెంట్స్ పుచ్చుకొని వాళ్ల ఆకర్షణలో పడకుండా నేను కాంప్లిమెంట్స్ ఇవ్వడం ప్రాక్టీస్ చేస్తున్నాను. అల్లాగే ఒరేయి చెవలాయిలూ! మీరు మాఆవిడకు కాంప్లిమెంట్స్ ఇచ్చి ఆకర్షిస్తే, నేను అదే పని చెయ్యగలను అని వాళ్లని బెదిరించగలగటానికి. ఇది నోటితో అనక్కర్లేదు. వాళ్లకి మెసేజ్ అదే కన్వే అవుతుంది. ఇంకపోతే బ్రహ్మచారులు నాకు కాంప్లిమెంట్స్ ఇస్తే ఏం చెయ్యగలరు మీరంటావ్? అవి పుచ్చుకొని నువ్వు సంతోషిస్తూ ఉంటే అదే సంతోషం ఇతర్లని పెట్టి నిన్ను ఉడికించగలను. నిన్ను కంట్రోల్ చెయ్యడం ద్వారా వాళ్లని చెయ్యగలను. అర్థమైందా ?''

''మీది వితండవాదం. నేను చేస్తే మీరు చెయ్యాలిగాని, ఊళ్లోవాళ్లు చేస్తున్నారని చెయ్యడం నాకు నచ్చదు'' అంది పార్వతి బాధపడ్తూ.

''అదికాదు పార్వతి... నువ్వు కొన్ని పనులు మిగతా ఆడవాళ్లు చేస్తున్నారు కనక చేస్తావు. నగలమీద వ్యామోహం, అవసరానికి మించిన చీరల వ్యామోహం నీకుండటం ధర్మమేనని అది అందరు ఆడవాళ్లకి ఉండేదేనని వాదిస్తావు. అప్పుడు నాకు బట్టలమీద మోజు లేదని నీకుండకూడదని వాదిస్తాననుకో నువ్వు ఒప్పుకోవు. ఎవరైనా ఆడవాళ్లు అర్ధ నగ్నంగా తయారైతే నేను వాళ్లకేసి చూస్తే, నువ్వూ అల్లా తయారౌతా నంటావు. అదే నేను, నువ్వుకూడా అర్ధ నగ్నంగా ఉన్న మగవాళ్లకేసి చూడు అంటాననుకో అప్పుడేమంటావు? మాకు అల్లా చూడాలని ఉండదు. మాకు చూడబడటమే ఇష్టం. అని అప్పైన అల్లాంటే ఎవరుపడ్తే వాళ్లచేత కాదు మా భర్తలచేతే! అని జాగ్రత్త పడ్తావు. నేను చూస్తున్నాను కనక నువ్వూ చూడవచ్చు అనే సూత్రం వర్తించదు అని వాదిస్తావు. అల్లాగే నువ్వు కాంప్లిమెంట్స్ పుచ్చుకొంటుంటే నేను పుచ్చుకోవచ్చనే సూత్రం వర్తించదు.''

''అంతగా ఇవ్వాలని ఉంటే ఇవ్వండి. అక్కడికే వెళ్లి ఇవ్వండి. ఇక్కడకి రాకండి. దేశం కాని దేశంలో నన్ను మీ యిష్టం వచ్చినట్టు ఏడ్పించండి'' అంటూ పార్వతి ఏడుస్తూ పడక గదిలోకి వెళ్లి పక్కమీదకి వాలిపోయింది.

''ఈ కొత్త దేశంలో కొత్త వాతావరణం ఇచ్చే కొత్త అవకాశాలపట్ల ఈ వ్యామోహం మా సంసారాన్ని ఎటు ఈడుస్తుందో'' అని ఆలోచిస్తూ సోఫాలోనే నిద్రపోయాడు శంకరరావు.

*[ఇంకా వుంది]*

## అతిసర్వత్ర వర్జయేత్

(18వ పేజీ తరువాయి)

'రండి గురూగారూ!' అన్నాడు నన్ను చూసి బాబూరావు.

గతుక్కుమన్నాను. బాబూరావు నన్నెప్పుడూ అట్లా పిలవలేదు. 'సూర్యం గారూ!' అంటూ మర్యాదగా కుర్చీలోంచి లేచి పిలిచేవాడు. నేను వయస్సులో అతని కంటే పెద్దవాణ్ని (పైగా ఎమ్మే ఎకనమిక్సు డిగ్రీ వున్నవాణ్ని... మురళీమోహన్ గారన్నట్లు ఆ డిగ్రీ అంటే మాటలా?!) అందువల్ల అంతవరకూ బాబూరావు లేచి నన్ను పిలవటం సామాన్యంగానే భావించుతు వచ్చాను. ఆవేళ బాబూరావు తీరు నాకొంచెం కోపం తెప్పించింది. కోపాన్ని పైకి కనబడనివ్వకుండా నవ్వుతూనే వెళ్ళి అతని ప్రక్కనకూర్చున్నాను. భోజనం చేస్తూ మాట్లాడుకుంటూ వుండగా వున్నట్టుండి అతనన్నాడు :

'గురూగారూ! మీరు ఆ ఏ. జి. ఆఫీసొదిలి యేదన్నా బ్యాంకులో చేరండి; యీజీగా ఆఫీసరవ్వొచ్చు. మా ఏజెంటున్నాడు పట్టి బరుద్దాయి; వాడికేం రాదు. అయినా ఏజెంటు. అంచేత... మీరు అనవసరంగా ఆ ఏ. జీ. ఆఫీసులో కొట్టుకోకుండా యేదన్నా బ్యాంకులో ప్రయత్నించండి; యిప్పుడు మాబ్యాంకులోఖాళీలేంలేవు. వచ్చినప్పుడు నేనూ ప్రయత్నిస్తాను' అన్నాడు.

నేను నిశ్చేష్టుణ్ణయ్యాను. బాబూరావెందుకిలా మాట్లాడుతున్నట్టు? నా కర్థం కాలేదు. నా వుద్యోగంలోని బాధల గురించి నే నెప్పుడూ చెప్పుకోలేదు. చెప్పుకోవాల్సిన అవసరం రాలేదు. ఒకవేళ వచ్చినా బాబూరావుతో చెప్పాల్సిన అవసరం అస్సలాదు. మరెందు కితనిట్లా వాగుతున్నట్లు?!... ఒకవేళ నా భార్యగానీ నేను లేని సమయంలో యితని విహా ప్రసక్తేమన్నా తెచ్చిందా?.. అదే జరిగి వుండాలి. మనిషి చులకనైపోటానికి అది చాలు. అంచేతే మధ్యవర్తులుండాలీ వ్యవహారాల్లో. ఆ జ్ఞానం ఆమెకి లేక ఆ ప్రసక్తి తెచ్చిందా? ఏమో. ఆ విషయం ఆమె వూరి నుంచి వచ్చాగ్గానీ తెలీదు. కానీ ఆమె అలాంటి మనిషి కాదు తన యిష్టాని కనుగుణంగా నేను ఆలోచించేలా చేసేందుకు. ఘర్షణ పడే మాట

విజంవే గానీ నేను సుముఖుణ్ణి గాను అని తెల్సినప్పుడు ఆ విషయంలో ముందుకు పోదు... మరి బాబూరావెందుకిలా వాగుతున్నట్టు ?!

హోటల్లోంచి బయటకొచ్చి కిళీ కొంటూ అడిగాను 'ఈ మధ్య మురళీ మోహన్‌గార్ని కల్సుకుంటున్నావా?' అని. ప్రతిరోజూ కల్సుకుంటున్నానన్నాడు. నాకను మానం కల్గింది. అయినా యెటూ తేల్చుకో లేక యింటిదారి పట్టాను.

తర్వాత కొన్నాళ్లకు బాబూరావు మా యింటి కొచ్చాడు. ఆవేళాదివారం. నేనేదో ఆఫీసు ఫైలు చూసుకుంటున్నాను. బాబురావు కుర్చీలో కూర్చుంటూ —

'గురూగారూ! (యీ మధ్య వీడికేదో తెగులు పుట్టింది; యెప్పుడూ నన్నిట్లానే పిలుస్తున్నాడు.) ఫైళ్లు యింటికొచ్చాకా తేవాల్సిందే ?!! మా బ్యాంకుల్లో అట్లా గాదు; అయిదు తర్వాత అరసెకను కూడా ఆఫీసులో వుండం. ఏంచెటో మీ వుద్యోగం పాపం !'అంటూ సానుభూతి చూపించాడు. నాకు వళ్లు మండిపోతోంది. పైగా నా భార్య మొదలెట్టింది.—

'మీకేవండి ? మీది బంగారం లాంటి వుద్యోగం' అంటూ. బయట పడటం లేదు గానీ బాబూరావుకు తన అన్న కూతుర్నో, అక్క కూతుర్నో యిప్పించాలన్న ఆశ ఆవిడలో చావలేదు. వాడు తనని అక్కగారూ అని పిలిచినప్పుడు తన అక్క కూతురికి ముడి పెట్టేద్దామని నిర్ణయిస్తుంది. వాడు నన్ను 'అన్నయ్యగారూ' అని పిల్చినరోజున వాడికి తన అన్నకూతుర్ని ముడి పెట్టాలని చూస్తుంది. ఈ మధ్య వాళ్ల అక్కయ్య కూతురికే యీ బాబూరావుగాణ్ణి కట్టి పెట్టాలనుకుంటోంది. ఎందుచేతనంటే వాడు ఆమెని అక్కయ్యగారూ అంటూ నన్ను 'అన్నయ్యగారూ' అంటం మానేసి 'గురూ గారూ!' అంటున్నాడు. పైగా యీ ఆడ వాళ్లంతా యింతే కాబోలు...తమ భర్తల వుద్యోగాల్తప్ప మిగతావాళ్ల వుద్యోగాలన్నీ బంగారంగానూ, రవ్వల నెక్లెసుగానూ కనిపిస్తాయిలా వుంది.

'అందుకేనండి అక్కయ్యగారూ! గురువు గార్ని నాలాగా బ్యాంకుద్యోగం వెతుక్కో మంటున్నాను' అన్నాడు.

నాకు కంపరమెత్తిపోయి 'బాబూరావ్! నువ్వు బ్యాంకు పరీక్షలకు కట్టావ్‌కదూ ? జాగ్రత్తగా చదువు కాలం వృథాచెయ్యకు' అన్నాను. (చెప్పొద్దూ 'నువ్విట్లా యింటికి రాకు. వచ్చినా యీ వాగుడు వాగొద్దు'అని నా వుద్దేశ్యం.)

'ఆఁ మేం పరీక్షలు పేసవ్వక్కర్లేదండి. మా బిడుద్దాయి వున్నాడు చూశారూ ... అదే మా ఏజెంటు... వాడికేం క్వాలిఫి కేషన్సున్నయ్యని యేజెంటయ్యాడు' అని మళ్లీ తనే అందుకున్నాడు.

''అసలు మా బ్యాంకులో వాళ్లు మురళీ మోహన్‌గార్లాంటి వాళ్లయితే నాకుయేడాది క్రితంనే ఆఫీసరు పోస్టొచ్చేది. (అతగాడు బ్యాంకులో చేరి రెండేళ్లయిందేమో)!' అన్నాడు.







...అదిసంగతి! నా అనుమానం నిజ మయ్యింది. దీనికంతకూ కారణం మురళీ మోహన్ గారన్నమాట! ఆయన తన సహజ ధోరణిలో బాబూరావుని అందలం యెక్కిం చేస్తున్నారు; యీ కుర్రసన్యాసి దానితో విర్రవీగిపోతున్నాడు. పొగడ్తగానీ విమర్శగానీ అవతలి వాడిలో కార్యదీక్ష కలిగించేదిలా వుండాలి గాని, వాడిని కర్తవ్య విముఖుడి గానో లేదా వాడిని వక్ర మార్గంలోకి త్రిప్పేదిగానో వుండ కూడదు; అలాంట ప్పుడే అది ఆరోగ్యకరమైన దనిపించు కుంటుంది...కాస్సేపు అవీ యివీ మాట్లాడి బాబూరావు వెళ్ళిపోయాడు.

తర్వాత వారం రోజుల కనుకుంటాను యూనివర్సిటీలో నాతోబాటు చదివిన నా మిత్రుడు రంగారావు శలవలకు అమెరికా నుంచి మనదేశం వచ్చి నన్ను కల్సుకునేం దుకు హైదరాబాదొచ్చాడు. మేమిద్దరం బజార్లో వెడుతూండగా బాబూరావుకల్సాడు. పరిచయాలయ్యాక బాబూ రావన్నాడు.

'నేనూ బహుశః వచ్చేయేడు అమెరికా వెళ్తానేమో నండి! మొన్న మా డైరెక్టర్లలో ఒకడు యింగ్లాండు వెళ్ళాడు. వాళ్ళు వెళ్తే బ్యాంకేం బాగుపడుతుందండి. బ్యాంకు బాగుపడాలంటే నాలాంటి వాళ్లని పంపాలి' అని.

'గుడ్‌మ్యాన్' అన్నాడు రంగారావు. 'మీరెప్పుడయినా న్యూయార్కు లోని నా యింటికి రావచ్చును,' అన్నాడు మళ్లీ.

బాబూరావుని రంగారావుకు పరిచయం చేసినందుకు నాకు పిచ్చి వేసింది. అనకూడదు గానీ అతనెక్కడ ? రంగారావెక్కడ ? రంగారావు అమెరికాలోని యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా వుంటున్నాడు. ఒకవేళ బాబురావు బ్యాంకుద్వారా అమెరికా వెళ్లటం జరిగినా (అది జరగని విషయమేనని నా కనిపించిందప్పుడు) రంగారావు అమెరికా వెళ్లటానికీ, బాబూరావు వెళ్లటానికీ తేడా లేదూ ? తేడా వుండకపోవచ్చు కూడాను. కానీ ఆ క్షణంలో నాకు ఎక్కడా నాగిలోకా నికీ వున్నంత తేడా వుందను కోవాలని పించింది. ఎలాగయితేనేం బాబూరావుని వదల్చుకుని మేం ముందుకు సాగాము.

తర్వాత ఒక నెల రోజులకు బాబూరావుని బ్యాంకులోంచి తీసివేసినట్టు తెల్సింది. నేను చాలా బాధపడ్డాను. నా భార్య మాత్రం 'యింకా నయం. మావాళ్ల పిల్లనిచ్చి సంబంధం నిశ్చయం చేశాంకాం' అంది... నాకు తలనొప్పి మొదలయ్యింది. రోడ్డు మీదకు నడిచాను.

రోడ్డుకుఅవతలివైపున మురళీమోహన్ గారు కనిపించారు. కానీ చూడనట్లు నటించి నడుస్తున్నాను, 'సూర్యం' అంటూ పిలిచారాయన. నిలబడి పోయాను. కారే నీ రావటం లేదు. కానీ నేను అక్కడే నిలబడి పోయాను. ఆయనే యిటువైపు వస్తు న్నారు. నాకు బాధగా వుంది— వారినే నా దగ్గరకు నడిపిస్తున్నందుకో, బాబూరావు పతనానికి ఆయనే బాధ్యుడనో... ఎందుకో తెలియదు... నేనలా చూస్తూనే నిలబడ్డాను. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నది ఆయనకే ఎందుకు అన్వయించాలి. బాబూరావుకు మాత్రం ఎందుకు అన్వయించ కూడదు ?! నాకుమాత్రం ఎందుకు అన్వయించకూడదు? ముందుకు రెండడుగులు వేశాను. అప్పటికే మురళీమోహన్‌గారు యీవైపుకొచ్చేశారు.. అదే ఆయన గొప్పతనం.

వివ్. ఆర్ ఆర్. – కలకత్తా

ప్రపంచ శాంతికి పంచశీల అవసరం అన్నారు. మరి ఇంటి శాంతికి మీ రే పంచశీలను సూచిస్తారు?

★ ఇంట్లో శాంతి అవసరమేగాని అది శాంతిగా ఒకళ్ళ నోరు నొక్కితే–ఒకరు పడి వుండేలాంటి శాంతి కాకూడదు! అందుకే యింట్లో శాంతికి సంధిసూత్రాలు కావాలి! ఆవి భార్యాభర్తలదెబ్బలాటలలో–తూచా తప్పకుండా అమలులోకి పెట్టాలి. అప్పుడు గృహ కలహాలు కూడా సామరస్యంగా పద్ధరాటు కావడమే కాదు–పిల్లలు బాధపడరు.

వి. ఆర్. ఆర్. – కలకత్తా

మనిషి విలువ ఎప్పుడు తెలుస్తుంది?

★ పాస్ బుక్ చూపెట్టకుండా అప్పులు పుట్టినప్పుడు.

ఆశకు అంతున్నదా?

★ లేదు తీరిన ఆశలస్థానాన్ని కొత్తఆశలు ఆక్రమించుకొంటూ వుంటాయి!

పి. డి. ఆర్. – మునాబేడ

ప్రేమించిన హృదయం గాయపడినప్పుడు ఆ ప్రేమ ద్వేషంగా మారుతుంది. ఆ ద్వేషం ప్రతీకారాన్ని కోరుతుంది ప్రతీకారాన్నితీర్చుకో తలచిన ఆ ద్వేషం పశ్చాత్తాపంగా మారుతుంది. మళ్ళీ మొదటిప్రేమ తలెత్తుతుంది. ఆ ప్రేమలో ఉద్రేకం వుండదు; ఆవేశం వుండదు. అసూయ రాగద్వేషాలకు తావుండదు. దానికి కేవలం త్యాగం అంటే ఏమిటో తెలుస్తుంది. ఎందువలన?

★ ఇంత లాజిక్ తెలిసి తమకీ సంగతి తెలియక పోవడం ఏమిటి, కొలిమిన కాలిన బంగారం వనుక మనలో మనమాట ప్రేమించిన హృదయం గాయపడితే యింకో




సింపుల్ దారివుంది–ఓర్పు. ప్రేమా ద్వేషం ప్రేమా పగా చెప్పుకొందుకు బాగానేవుంటాయి గాని అవి సినిమాటిక వాస్తవంలో ద్వేషం లోంచి ప్రేమ పుట్టడానికి–రడీమేడ్ సొల్యూషన్స్ లేవు.

ఎమ్. ఎస్. ఎస్. నల్గొండ

టీచ్ చేసేవారు కాబట్టి టీచర్ అంటారు. ఉపదేశించేవారిని ఉపాధ్యాయులు అంటారు. మరి పంతులు అంటే

★ పంతం పట్టి, జీతాలివ్వకపోయినా పడి గాపులుపడి వుండే వాడని కాబోలు! మరి నాకు తెలియదు.

ఆర్ ఎల్. – విశాఖ

దేవుడు పవిత్రుడుగా వుండాలిగాని మానవులతో సమానంగా ఇంతంత మంది భార్యలను కలిగివుండడం మానవునికి దేవునికి తేడా ఏమిటి?

★ దేవుడు తన లీలల ద్వారా మానవుని బలహీనతలకు రూప కల్పన యిచ్చి–వాటినుండి విముక్తి పొందే మార్గం చూపిడుతున్నాడంటారు కొందరు "ఏ తప్పుచేసినా ఫరవాలేదు పశ్చాత్తాపం అన్ని పాపాలనీ కడిగివేస్తుంది అదే దేవుని కథలు చెప్పేది" అంటారు కొందరు. 'దేవుడే చేయగా లేనిది...' అని మానవుడు చేసినా. "నే సృష్టించిన మానవుని కంటే నేను తీసిపోయానా" అని దేవుడే దిగి వచ్చినా...... వ్యక్తి నీతి విలువ మారదు సోదరీ; అదే మానవునిలో దైవత్వం చూపెడుతుంది అదే గ్రహించమని కాబోలు దేవుడి చర్యలు చాటేది.

జి. వి. ఎమ్. – హైదరాబాదు

ఈ వూళ్ళో పుట్టి పెరిగి చదువు ముగించాను. దూరప్రాంతాలలో ఏవో చిన్న ఉద్యోగాలు అవకాశాలు వస్తున్నాయి. కాని వూరు వదలడం నా కిష్టం లేదు.

★ వూరుమీదా తల్లిమీదా కట్టుకున్న దానిమీదా ప్రేమ వుండడం సహజమే. కాని ఒక్కటి గుర్తుంచుకోవాలి. పట్టువదలని తేనెటీగ తేనె ఎలా కూడబెట్టకలదు. ఇంపాసిబుల్.

ఆర్ ఆర్. ఎమ్. – అనంతపురం

ఈ భారతదేశంలో ఏ భర్త భార్య యొక్క సలహా తీసుకోకుండా ఏ పని చేయుచున్నాడు?

★ అడిగితే బదులు చెప్పడం సలహా అనరు. అదే ఆమెకి తోచిన మాటగా చెప్తే 'ఆడ సలహా నాకేం అక్కరలేదనే వాళ్ళు ఎంత మంది?' అయినా స్త్రీపట్ల పురుష స్వభావం తెలియడానికి అతగాని యిల్లు కాదు కొలబద్ద. ఏ కొంపలోనైనా మట్టిపొయ్యి అన్నట్లు–గృహ రాజకీయాలు వేరు. సమాజంలో స్త్రీపట్ల చులకనభావం ప్రదర్శించే వాళ్ళు యింట్లోను అంతే!

ఎస్ ఎస్ ఎమ్ – బరంపురం

నేడు వస్తున్న సినిమాలలో నున్న అశ్లీల ధోరణులను శృంగార దృశ్యములకు స్త్రీలందరూ కలిసి ఎందుకు సమ్మె చేయరు?

★ వాళ్ళకో పార్టీ లేదు. నాయకత్వం అంతకంటేలేదు! ఇక మన యువకులంటారా? అనవసరంగా వచ్చేపోయే బస్సులపై రాళ్ళు రువ్వుతారే గాని–గోడలనిండా కొట్టొచ్చినట్టున్న అసభ్యమైన పోస్టర్లనేం చెయ్యలేరు!!

ఎమ్. కె – ఎమ్మిగనూరు

నేను పెళ్ళిచేసుకోవాలను కుంటున్నాను. అందం. గుణంవున్న తెల్ల నల్ల, ఎర్ర అమ్మాయిల్లో ఏ అమ్మాయి బాగుంటుంది?

★ ఇలాంటి అనుమానాల పుట్టవి; నిర్ణయాలు చేసుకోలేని వాడివి–నువ్వు పెళ్ళి చేసుకుందుకు ఏ పిల్ల సిద్ధంగావున్నా–ఆ పిల్లని చేసేసుకోడం ఉత్తమం–కృష్ణా!

చిన్మయి – చాగంటిపాడు

దాన వీర శూర కర్ణలో ద్రౌపతినలా చిత్రికించారేమిటి అని రచయిత శ్రీ కొండవీటి వారిని అడుగగా, "భారత స్త్రీలు బహు పతి వ్రతలు కదటోయ్"–అని వ్యంగ్యంగా అన్నారు. కారణం?

★ కొండవీటి వారు ముందూ వ్యంగ్యం తరువాతా పుట్టాయి. అంచేత. అంతేకాని స్త్రీలపై శ్రీ వెంకట కవిగారికి అపారమైన గౌరవం వుందని నేను గ్యారంటీగా చెప్పకలను. పరవోక్తి కాస్త బెడిసి కొట్టిందనుకోండి. ●



# మి పాపాయికి బుద్ధి
# ప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి.
# మందలించండి, ముద్దుచేయండి.






## రబెక్స్

**అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...**

# రబెక్స

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించే విశ్వసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై, వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రబెక్స త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతీలో బిగువును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. మీతోనూ, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు...త్వరలోనే.

మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము.

గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన

everest/665/ACW.

# వారఫలం

22-12-1978 శుక్రవారం మొదలు
28-12-1978 గురువారం వరకు

మేషం :— మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

వృషభం :—సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మిధునం : మీ మంచి తనమే మిమ్ములను ఇబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

కర్కాటకం : వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

సింహం :—మీ శ్రమకు తగినఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కన్య :—వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

తుల :—చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

వృశ్చికం :—వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో ప్రయాణ కలుగుతుంది. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

ధనుస్సు :—అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది.

మకరం : అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

కుంభం :—వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

మీనం :—ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

—మహేష్

## జీవితం

ఆశ
ఓ కిరణం.
నిరాశ
అదో మరణం.
ఆశ, నిరాశల
సంద్రంలో
పడిలేచే కెరటం
జీవితం.

— వెంపలి వేంకట శివప్రసాద్.



# భగవాన్ ఏమిటిది?

శీకిళ్ల వెంకట సూర్యనారాయణ

పదకొండవసారి ఆ టెలిగ్రాం చదివి జేబులో పెట్టుకున్నాడు అనంతయ్య. అనంతయ్య ప్రక్కన కూర్చున్న అనసూయమ్మ భర్త కేసి చూసి మళ్ళీ తల అటు తిప్పింది. ఆమె కళ్ళలో ఏర్పడిన తడి ఏక్షణంలోనైనా క్రిందికి జారటానికి సిద్ధంగా ఉంది. రైలు మాత్రం అందరితో పాటు వీళ్ళని కూడ మోసుకుని పోతునేవుంది.

ప్రభాకర్‌కి ఏం కాలేదు కదా! నేను వెళ్ళే సరికి వాడ్ని చూస్తానా! అసలు ఎందుకు దెబ్బలు తగిలాయట. కారు క్రింద పడ్డాడా! సైకిలు దేనికైనా గుద్దుకుందా! మీ అబ్బాయికి దెబ్బలు తగిలాయి, వెంటనే రండి అని టెలిగ్రాం ఇచ్చిన ఇంజనీరింగు కాలేజీ ప్రిన్సిపాల్ మరి నాలుగు లైనుల వివరంగా టెలిగ్రాం ఇస్తే ఏం పోయింది. అసలు వాడ్ని విశాఖపట్నంలో పెట్టి చదివించకుండా ఉంటే పోయేది. అను కుంటు న్నాడు అనంతయ్య.

ప్రభాకర్ పుట్టినపుడు "తొలుచూరు మగపిల్లవాడు, అదృష్టవంతుడివి నీచేతికి పెందరాళే అంది వస్తాడు" అని తాలు కాఫీసులో సాటిగుమాస్తాలు అభినందించారు అనంతాన్ని.

అపుడు వాడ్ని బాగ చదివించాలి. వాడు నాలా తాలూకాలో గుమాస్తా కాకూడదు అను కుంటు ఆరోజు స్నేహితులకు విందు ఇచ్చాడు అనంతయ్య.

ఆ తర్వాత ప్రభాకర్ తప్పటడుగులు వేస్తు తల్లిదండ్రులను చూసి నవ్వినపుడు, ఆ పిల్లవాడ్ని ఎత్తి ముద్దాడి "వీడ్ని ఇంజనీరు చేస్తాను" అనేవాడు అనంతయ్య.

"చాల్లెండి సంబడం వేలుడులేదు వీడి మీద ఆశలు పెంచేసుకుంటున్నారు" అనేది అనసూయమ్మ నవ్వుని అణిచి పెట్టుకుంటూ.

"చూస్తుండు. వీడు పెద్ద ఇంజనీరై నిన్ను జీపులో ఎక్కించుకొని తిప్పుతాడు."

"సరేలెండి ఆ రోజు వస్తే మీరే ఎక్కి తిరగండి సరేనా" అనేది అనసూయమ్మ.

ఆ తర్వాత మరో ఇద్దరు మగపిల్లలు, ఆ తర్వాత మరో ఇద్దరు ఆడపిల్లలు పుట్టి నపుడు ప్రభాకర్‌ని చదివించలేనేమో అని భయపడ్డాడు అనంతయ్య.

ప్రభాకర్ మొదటి నుంచి చదువులో ఫస్టుగానే వచ్చాడు. అలాగే ఇంటరులో కూడ కాలేజీకి ఫస్టుగానే వచ్చాడు.

ఆ నాటికి అనంతయ్యకి ప్రభాకర్‌ని ఇంజనీరింగు చదివించాలన్న నిశ్చయం కేవలం కోరికగా మాత్రం మిగిలింది. రిజల్టు రాగానే, "అయితే నేను విశాఖ ఇంజనీరింగు కాలేజి అప్లికేషన్ తెప్పించనా" అడిగాడు ప్రభాకర్. తెప్పించు చూద్దాం తేలికగానే అనేసాడు అనంతయ్య.

మాట అయితే అనేశాను. ఎక్కడ రాజమండ్రి, ఎక్కడ విశాఖపట్నం. హాస్టల్‌లో పెట్టి చదివించగలనా? ఆలోచనలో పడ్డాడు అనంతయ్య. ఈ విషయమే స్నేహితునితో చర్చించాడు.

"తల తాకట్టు పెట్టి అయినా చేర్పు. తరువాత కొంత స్కాలర్‌షిప్ వస్తుంది. ఆపైన నెలకొక నూరు, నూటపాతిక రూపాయలు పంపితే హాస్టలు కాకుండా ఏ రూములోనో కాలక్షేపం చేస్తాడు. కుర్రాడు బుద్ధిమంతుడు. సలహా ఇచ్చాడు మిత్రుడు.

"నూరు-నూటపాతికలు నెల నెలా పంపగలమా! ఇక రెండేళ్ళలో వెనకాల వాడు ఇంటర్‌కి వచ్చేస్తున్నాడు కదా" సందేహించాడు అనంతయ్య.

"బాగుంది పంపగలమా! అంటే ఎలాగా? కడు కట్టుకున్నైనా పంపాలి అయిదేళ్ళు ఎంతలో అవుతుంది. ముందు వాడు

నాలుగవ సంవత్సరంలోకి వచ్చేసరికి వెనకాల వాడు కాలేజికి వచ్చేస్తే వెనకాల వాణ్ణి ఒకటిరెండు అవుతావు,ఏదోఒకటి చేయాలి. వాడు రేపు సంపాదించి నీలా వాడు బరువు, బాధ్యతలు పంచుకుంటాడుకదా !'' అన్నాడు మిత్రుడు.

ఆ విషయమే భార్యతో చెప్పాడు అనంతయ్య. ఆమె అవును అని కాని, కాదు అని కాని అనలేదు. నెల తిరగ కుండానే కాలేజీలో చేరమని కాయితం వచ్చింది. అనంతయ్యకి మతి పోయినంతపని అయింది. కాలేజీలో చేర్చడానికి, బస ఏర్పాటుకి, కనీసం నాలుగు వందలయినా ఉండాలన్న విషయం అతనికి తెలియనిది కాదు.

అనసూయమ్మ మొదటి నుంచి కాస్త నిదానం ప్రధానం అనే అభిప్రాయం కలది. ప్రభాకర్‌ని ఇంజనీరు చేద్దామనే భర్త కోరిక ఆమెకు తెలుసు. దానితోపాటు తమ కుటుంబ ఆర్థిక పరిస్థితి ఆమెకు తెలుసు. అందుకే భర్త ప్రభాకర్‌ని చదివించడానికి తన నిశ్చయాన్ని చెప్పినపుడు ఆమె అవును అని కాని, కాదు అని కాని అనలేదు. అయితే ఆమె అంటే అంట నట్టుగా ఉండలేని పరిస్థితి కలిగింది.

ఆ మర్నాడే ప్రయాణం విశాఖకు. అనంతయ్యకు అప్పు ఎక్కడా దొరకలేదు. ఆ విషయం అతను కొడుకుతో చెప్పలేక పోయేడు. ప్రభాకర్ బట్టలు, కొన్ని పుస్తకాలు సర్దుకుని తన మిత్రులతో రేపే ప్రయాణం అని చెప్పడం గూడ విన్నాడు.

దిన్నగా భార్య దగ్గర వంటింట్లో పీట

# భగవాన్ ఏమిటిది?

మీద కూర్చుని నిట్టూర్పు విడిచాడు. విషయం గ్రహించిన అనసూయమ్మ గ్లాసుడు మంచినీళ్లు అందించింది.

గ్లాసు క్రింద పెడుతూ "డబ్బు దొరక లేదు అనసూయా! రేపే ప్రయాణం. ఏం చేయాలో తోచటం లేదు !" అన్నాడతను.

"మొత్తం ఈ నాలుగు వందలలోనే వాడి ఇంజనీరింగు చదువు పూర్తి కాదు. ఇలాంటి సందర్భాలు మనం ఎన్నో ఎదుర్కోవాలి. మొదట చేర్పించడానికే ఇన్ని అవస్థలు పడుతున్నాము... ఇక..."

"ఈ గండం గడిస్తే ప్రతి నెలా పంపటం అంత కష్టం కాదు. ముందు ఈ గండం గడవాలి కదా!" మధ్యలో అందుకున్నాడు అనంతయ్య.

"వాడు మీకే కాదు నాకూ కొడుకే. ఏ పరిస్థితుల్లోనైనా చదివిద్దామని మీరు అనుకుంటే కానీయండి నాకు ఆనందమే" అంటూ ఆమె మెళ్లో ఉన్న రెండు పేటల గొలుసు తీసి భర్తకిచ్చి "ప్రస్తుతానికి ఇది పనికొస్తుంది. మీరన్నట్లు నెలనెల పంపటం సంగతి తరువాత చూసుకోవచ్చు. వెళ్లి చేర్పించి రండి" అందామె.

"నీ గొలుసు అమ్మేయనా ! నేను నీకు చిన్నమెత్తు బంగారం కొనలేదు కాని..." అతని మాటలు పూర్తి కానివ్వలేదు అనసూయమ్మ.

"అది కాదండి ఈ గొలుసు బాగా అరిగిపోయి గుచ్చుకొంటోంది. మీకు డబ్బు అందినపుడు మళ్లీ బంగారం కొనండి. మళ్లీ చేయించుకుంటాను. సరేనా ?'' అందామె.

"అమ్మితే మళ్ళా కొనలేము. కావలసింది నాలుగు వందలేకదా ! తాకట్టు పెడదాం తరువాత విడిపించుకోవచ్చు" అన్నాడు అనంతయ్య గొలుసు తీసికొంటూ.

అన్నాడే కానీ మరి రెండు నెలల తర్వాత పుస్తకాలు కొనటానికి డబ్బు కావాలని ప్రభాకర్ వ్రాసినపుడు, ఆగొలుసు అమ్మి తీయక తప్పలేదు అనంతయ్యకు.

ఇలా నాలుగేళ్ళు గడిచే సరికి, ప్రభాకర్ నాలుగవ సంవత్సరంకి రావటం ఈలోపుగా అనసూయమ్మ చేతిగాజుల, మెళ్ళో నానుతాడు, ఉన్న ఎకరం పొలం వాళ్ళవి కాకుండా పోయాయి. ఆయింటికి చాకలి, దాసీది, రెండవపూట కూర, నెయ్యిలాంటివి చాలా దూరం అయిపోయాయి.

ప్రభాకర్ తరువాతి వాడు ఇంటర్ ప్యాసు అయి, అన్నచదువు పూర్తి అయిన తర్వాత కాలేజిలో చేర వచ్చని, ఈ లోపుగా కొమ్మూర్రి డిటెక్టివ్ నవల్సుతో మొదలు పెట్టి ఆంధ్ర పత్రికల్లో దాచి చదవవలసిన పుస్తకాల్లోకి పడ్డాడు.

ఇప్పుడు ఈ టెలిగ్రాం వచ్చింది ప్రిన్సిపాల్ నుంచి. వెంటనే భార్య, భర్తలు విశాఖపట్నం బయలు దేరేరు. విషయం ఏమిటో అర్థం గావటంలేదు అనంతయ్యకు. 'నా ఆశలన్నీ వాడిమీదే పెట్టుకున్నాను. వాడికేం కాదు కదా! నన్ను అన్యాయం చేయకు భగవంతుడా!' రెండు చేతులు జోడించాడు అనంతయ్య.

అనసూయమ్మ భర్తకేసి చూసింది.

భర్త చేతులు జోడించటమూ చూసింది. ప్రభాకర్‌ని కాలేజిలో చేర్పించిన నాటినుంచి కష్టాలు ఆమెను అన్ని వైపుల నుంచి చుట్టుముట్టి ఆమె వయస్సును పదేళ్లు పెంచాయి. దరిద్రం, ఆకలి, రెండు గుప్పెళ్ల మజ్జిగన్నం, ఇవన్ని అనుభవించి ఆమె చేతులులాగే ఆమె మనసు గూడ రాటు తేలింది. 'మనం విధి చేతిలో కీలు బొమ్మలం. వాడికేం కాదు. అయినా మనం చేయగలిగింది ఏమీ లేదు. భగవంతుడు దయామయుడు. ఇంతకన్న నన్ను కష్ట పెట్టడు' అని మాత్రం అనుకుందామె.

వాల్తేరు స్టేషనులో బండి దిగగానే



# ఎన్నో కప్పుల కమ్మని చిక్కని టీ కోసం

మా కుటుంబానికి,
ఎన్నో కప్పుల కమ్మని
చిక్కని టీ--రుబికి
మా కృతజ్ఞులు !






లిప్టన్
రుబి
డస్ట్

LRDC/CAS-1/78 TE.

అనంతయ్య చుట్టూ చూసాడు. ఆమెకూడ దిగింది. ఆమె చేతిలో చిన్న సంచీ వుంది. అందులో ప్రభాకర్ కిష్టమైన మినపసున్ని ఉండలు ఉన్నాయి.

"బాబయ్యగారూ!" అనే పిలుపు విని టక్కున వెనక్కి తిరిగాడు అనంతయ్య. ఎదురుగా ఉన్న రంగరాజుని పోల్చుకున్నాడు. ప్రభాకర్, రంగరాజు ఒకే రూములో వుంటు న్నారు.

'ప్రభ కేమయింది' ఆతృతగా ప్రశ్నించాడు అనంతయ్య.

"కాలేజీలో చిన్న గొడవ జరిగింది. దాంట్లో ప్రభాకర్‌కి దెబ్బలు తగిలాయి. ఆసుపత్రిలో ఉన్నాడు అందువల్ల..."

"ప్రమాదం ఏం లేదుకదా" అడిగింది అనసూయమ్మ.

"ఇంకేం ప్రమాదం లేనట్లే..."

"పోనీలే నాయనా! నీకడుపు చల్లగా, చల్లటి మాటలు చెప్పావు. నిండు నూరేళ్ళు బ్రతుకు నాయనా" దీవించింది అనసూయమ్మ.

ఆమె ఆప్యాయతకు, ఆశీర్వచనంకు కళ్ళు నీళ్ళు గిర్రున తిరిగాయి రంగరాజుకి. "నావల్లే ప్రభకు దెబ్బలు తగిలాయి. నన్ను క్షమించండి" అన్నాడతను.

"అసలు ఏం జరిగిందేమిటి!" ప్రశ్నించాడు అనంతయ్య.

రండి హాస్పిటల్‌కు వెళుతూ మాట్లాడు

# భగవాన్ ఏమిటిది?

కోవచ్చు అన్నాడతను. ఆటో రిక్షా కింగ్‌జార్జి హాస్పటల్‌కి వెళుతుంటే చెప్పటం మొదలు పెట్టేడు రంగరాజు. "యూనివర్సిటీలో యూత్ ఫెస్టివల్ జరుగుతోంది. అందులో అన్ని కాలేజీలు పాల్గొంటున్నాయి. మొన్నరాత్రి మా ఇంజనీరింగు కాలేజి నాటకం అవుతోంది. అప్పుడే సరిగ్గా ఎవరో పిల్లికూత కూశారు. యూనివర్సిటీ స్టూడెంటు కూసాడని అతన్ని పట్టుకొని కొట్టాడు మా ఇంజనీరింగు కుర్రాడు. దాంతో ఆరంభం అయింది గొడవ. కుర్చీలు, బల్లలు, సోకలు అన్నీ ఎగిరిపోయాయి. యూనివర్సిటీ స్టూడెంటులు అక్కడ ఎక్కువ ఉండటంతో, మా ఇంజనీరింగు వాళ్ళు తన్నులు తిని రావలసి వచ్చింది.

ఇది మొన్న జరిగింది. నిన్న ఉదయం మా స్టూడెంటులు అంతా కలిసి యూనివర్సిటీ హాస్టలుకు వెళ్ళి చితకతన్ని రావాలని నిశ్చయించుకున్నాము. అంతవరకు ప్రభకు ఈ విషయమే తెలియదు. నాటకం చూడ టానికి గూడ రాలేదు. రూములోనే చదువు కుంటున్నాడు. నిన్న మేము యూనివర్సిటీ మీదకు దాడి చేయడానికి వెళుతుంటే ప్రభ ఫోంచేసి రూముకొస్తున్నాడు. విషయం చెప్పిరమ్మని కోరాను. 'వద్దు రాజా నేను రాను. చదువుకోవాలి' అన్నాడు వాడు. నేను వినలేదు. 'రూము తాళం ఇవ్వను. జనంలో ఒకటిగా నిలబడు చాలు' అన్నాను– చివరికి నామాటే నెగ్గింది. మేమంతా దాడి చేశాం. యూనివర్సిటీ వాళ్ళని చితకగొట్టాం. అందులో కొందరు తిరగబడ్డారు– ఇంతలో పోలీసులు వచ్చారు. మేము పరుగు పెట్టాము. ప్రభ మాత్రం సోషియాలజీ చదువుతున్న ఒక యూనివర్సిటీ కుర్రాడికి దొరికిపోయేడు. వాడు చేతిలోని బీర్ బాటిల్‌తో ప్రభ తల మీద కొట్టాడు!" ఆగాడు రంగరాజు.

'ఆ' అన్నాడు అనంతయ్య.

ఆటో తిన్నగా వార్డు ముందు ఆగింది. "ఎక్కడ ప్రభాకర్?" అంది అనసూయమ్మ. "రండి" దారి తీశాడు రంగరాజు. అతని వెనుక మినపసున్ని వుండలు పుచ్చుకొని నడిచింది అనసూయమ్మ. అనంతయ్య అనుసరించాడు. రంగరాజు రెండు అడుగులు వేసి టక్కున ఆగిపోయేడు. ఎదురుగా పద కొండవ నెంబరు బెడ్ దగ్గర చుట్టూ జనం మూగి వున్నారు. రంగరాజు గబగబ బెడ్ దగ్గర కెళ్ళాడు.

ప్రిన్సిపాల్– "వచ్చారా?" అడిగాడు రంగరాజుని. ఆవేశం, ఆయాసం, బాధ, దుఃఖం ఇవన్నీబిగపెట్టుకుంటున్నరంగరాజు వ్రేలితో అనంతయ్యని చూపాడు. "మీరు అందరు వెళ్ళండి" అన్నాడు ప్రిన్సిపాల్. చుట్టూ వున్నవారు మౌనంగా వెళ్ళిపోయేరు.

అనంతయ్య ప్రభాకర్ కేసి చూస్తు న్నాడు. అతని ముక్కులో పెట్టిన ఆక్సిజన్ గొట్టంకేసి చూస్తున్నాడు. తలమీద కట్టిన బేండేజికేసి చూస్తున్నాడు. బేండేజిలోంచి కనపడుతున్న చిన్న మొహం కేసి చూస్తు న్నాడు. కాబోయే ఇంజనీరును చూస్తు న్నాడు. తన గృహ బాధ్యత మోయవలసిన నవయువకుణ్ని చూస్తున్నాడు. ఇంతలో కళ్ళువిప్పి ప్రభాకర్ తల్లిదండ్రులను చూసి చేతులు జోడించడము చూశాడు.

అతని కళ్ళు నీళ్ళతో నిండి మసకయి పోయాయి. కళ్ళు వత్తుకుని చూసాడు. బాగా చూశాడు. డాక్టరు తలమీంచి గుడ్డ కప్పి నిలబడటం చూశాడు.

అనసూయమ్మ చేతిలో మినపసున్ని ఉండలు సంచి జారి క్రిందపడి భళ్ళుమంది ఆమె గుండెలాగే. "భగవాన్ ఏమిటిది?" గొణిగింది ఆమె.



ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# మీ స్వగృహం కోసం మేము సగం చెల్లిస్తాం:



## పొదుపు చేయండి మీరు మీ వంతు అందచేస్తాం మేము మా వంతు స్వగృహం కోసం ఒక పొదుపు పథకం

మీ స్వంత ఇంట్లోకి ప్రవేశించాలని మీరు అనుకుంటూ వుంటే, అందుకు కావలసినదంతా మీరే పొదుపు చేయక్కరలేదు. ఇండియన్ బ్యాంక్‌లో మేము మీ ఖర్చులు సగం వరకూ భరిస్తాం — స్వగృహం కోసం పొదుపు చేయండి పథకంతో.

ఈ అకౌంట్‌లో 84 నెలలపాటు ప్రతినెలా చెల్లించిన నూరు రూపాయల వలన మీకు రూ. 9,590 తిరిగి రావడమే కాక దానితో సమానమయిన ఋణమూ లభిస్తుంది — కేవలం 8% వడ్డీతో దీనిని 84 నెలలలో తిరిగి చెల్లించవచ్చు.

మీరు ఎటువంటి ఇల్లుకావాలనుకుంటారో ఆ ప్రకారం మీరు చెల్లించే మొత్తాన్ని మార్చుకోవచ్చు — కాల పరిమితిని కూడా. మీరు మావద్దనుంచి కోరే మొత్తాన్ని రూ. 30,000 వరకూ ఆశించవచ్చు. అంటే రూ. 60,000 విలువచేసే ఇంటిని కొనుక్కోడానికి లేక కట్టుకోడానికి మీరు నిర్ణయం తీసుకోవచ్చు.

దీని గురించి ఆలోచించండి — మీకు సాధ్యమయినంత త్వరలో అకౌంట్‌ని ప్రారంభించండి. అది మీ నూతన జీవితానికి ప్రారంభం కావచ్చు — మీ స్వగృహంలో.

మీ సమీపంలోని ఇండియన్ బ్యాంక్ బ్రాంచిలో పూర్తి వివరాలు లభిస్తాయి.

**ఇండియన్ బ్యాంక్**
**మీ సుఖసమృద్ధికి సహకారి**

స్వగృహం కోసం ఒక పొదుపు పథకం



IB/2886/TEL R

# చందా పెరగలేదు! లాభం తరగలేదు!!

## ఇప్పటికి 44,500 పైగా గృహ గ్రంథాలయాలు వెలిశాయి
## వాటికై 20,00,000 గ్రంథాలు పంపిణీ అయ్యాయి!

ఎందరో ఈ ఉద్యమాన్ని 'ఓ' నన్నారు.

- సకుటుంబంగా పుస్తకాలు చదివి ఆనందిస్తున్నారు!
- మీనమేషాలు లెక్కపెట్టక మీరూ చేరండి!
- మంచి పుస్తకాలను సేకరించడాన్ని మించిన మంచిపని లేదు కదా!

## నేడే చందాదారులుగా చేరండి!




## సంప్రదాయ సాహిత్యం, ఆధునిక సాహిత్యం, పరిశోధనలు, విమర్శలు, జీవిత కథలు, బాల సాహిత్యం, విజ్ఞాన విశేషాలు - ఏవి కావాలిస్తే అవి!

ఈ క్రింది 5 పుస్తకాల నుంచి మీకు కావలసిన **2** ఉచిత పుస్తకాలని ఎన్నుకోండి!

1. గర్ల్ ఫ్రెండ్ * డాక్టర్. సి. ఆనందారామం
2. పునర్జన్మ * కన్నడ మూలం: త్రివేణి, తెలుగు సేత: కల్యాణి
3. అందని చందమామ * పి. గణపతిశాస్త్రి
4. చివరి మజిలీ * యర్రంశెట్టి శాయి
5. కళాపూర్ణోదయం * ఉషశ్రీ (వచన ప్రబంధం)

## చందా కట్టే విధానం...

ఈ పక్కన ఇచ్చిన **5** పుస్తకాల నుంచి మీకు కావలసిన **2** ఉచిత పుస్తకాల్ని ఈ దిగువనున్న కూపనులో గుర్తించి - దానిని, M.O. గా మొదటి నెల చందా రూ. **10** లు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్. 500003 అడ్రసుకు పంపండి! ఆ తరువాత నెలనెలా రూ. **10** ల చొ॥ ఆ నెలాఖరులోగా చందా మొత్తం రూ. **120** లు అయ్యేదాకా పై చిరునామాకు పంపుతూ ఉండండి!

1979 జనవరి 15 లోగా చందాదారులుగా చేరి **మాదిరెడ్డి సులోచన** సరికొత్త నవల **బిందుపథం** **బోనస్ పుస్తకంగా** పొందండి!




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్ వారికి....

అయ్యా!

మీరు నిర్వహిస్తున్న 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' పథకానికి నన్నొక చందాదారుగా చేర్చుకొనగోరుతున్నాను. పథకం తాలూకు నిబంధనలకి బద్ధుడనై ఉంటాను. మొదటి నెల చందా రూ. 10 లు M.O. గా పంపుతున్నాను. మొదటి **2** ఉచిత పుస్తకాలుగా ఈ కింద గుర్తించిన (✓) నంబర్లు పంపండి!

[1] [2] [3] [4] [5] ఇట్లు

పేరు:

చిరునామా



## కానిస్టేబులును కత్తితో పొడిచిన కలకంఠి!

చండీఘర్‌లో ఓ బీటు పోలీసు తన డ్యూటీ చేస్తూండగా విఖ్యాత జేబుదొంగ మోహన్‌లాల్ ఓ అమ్మాయిని సైకిలెక్కించుకు పోతూండడం చూసి ఎగిరి దుమికి అతన్ని. ఆ సైకిలునీ ఆపేసుకున్నాడట. వాగ్వాదంలో ఆ మోహన్‌లాల్ పోలీసును చాచో లెంపకాయ కొట్టాడట. దాంతో పోలీసు గంతేసి, వాడిని కుస్తీ పట్టు పట్టి పడేసి విజయగర్వంతో ఆ అమ్మాయికేసి చూసేసరికామె చివ్వున తన జాకెట్టులోంచో కత్తితీసి కసక్కున అతని పొట్టలో ఒకే వంచన లేకుండా పొడిచిందట. దాంతో ఆ కానిస్టేబుల్ అడ్డం పడ్డాడట పడి రోడ్డుపై. ఆ సుందరి పేరు మధుబాలట.... అయితేనేం. కత్తి కత్తే. పోటుపోటేకదా!

## సముద్రతీరాన స్త్రీ శవం

1972లో నెల్లూరుకు 14 మైళ్ళదూరంలోని మైపాడు సముద్రతీరంలో కళారాణి, చంద్రికారాణి అనే యిద్దరక్కచెల్లెళ్ళు అతి దారుణంగా చంపబడ్డారు. ఈ నెల 13వ తేదీన అదేస్థలంలో మళ్ళీ ఒక స్త్రీ శవం కనుగొనబడిందట. శవం శరీరంమీద కత్తిపోట్లు వున్నాయట మెడలో మంగళసూత్రాలూ, క్రైస్తవ శిలువా వున్నాయట. ఇంత దారుణంగా ఎవరు, ఎందుకు హత్యలు చేస్తున్నారో. అందునా స్త్రీ హత్యలే ఎందుకు చేస్తున్నారో పోలీసులు ఆరాలు తీస్తున్నారట.

## జర్మనీలో తయారవుతున్న శివలింగం!

జమ్ములోని వందసంవత్సరాల పురాతనమైన రఘునాథ్ కోవెలలో ప్రతిష్ఠించడానికిగాను స్ఫటిక శివలింగాన్ని పశ్చిమ జర్మనీలో తయారు చేయిస్తున్నారట. ఈ విషయాన్ని ఒకనాటి కేంద్ర ఆరోగ్యశాఖా మాత్యులు కరణ్‌సింగ్‌గారన్నారట.

## ఆకుకూర కోసం!

ఆరణికి చెందిన కణ్ణమంగళం అనే వూరిలో 19 ఏళ్ళ చిదంబరం అనే కుర్రాడు చిన్నప్పయ్యన్ అనే అతని తోటలో దూరబడి ఆకుకూర మొక్కలు కోసుకునే వాడట. ఒక నాడు చిన్నప్పయ్యన్ మాటేసి అతన్ని పట్టుకుని. నాలుగుతిట్టి, రెండు అంటించిపంపాడట. అయినా చిదంబరం తనపని మతరామూ మానుకోనందువల్ల చిన్నప్పయ్యన్‌కు కోపంవచ్చి వెదురు నరికే కత్తి పెట్టి చిదంబరం పొట్టలో ఎగిరి పొడిచి, కత్తి బయటకు లాగాడట. ఆ దెబ్బతో చిదంబరం పొట్టలోని ప్రేవులు, పగ్గైరాలన్ని బయటికి వచ్చేశాయట.

## 2200 పుటల నవల :–

ప్రముఖ కన్నడ రచయిత శ్రీ వి.కె. నాగరాజరావు నవంబర్ 11న కళాభవన్‌లో జరిగిన ప్రత్యేక రచయితల సమావేశంలో తాము రచించిన పెద్ద నవల–2200 పుటల నవల–"పట్టద మహాదేవి శాంతలదేవి"ని గురించి వివరించారు. సాహిత్య అకాడెమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షతవహించారు. శ్రీ పోతుకూచి సాంబశివరావు రచయితను పరిచయం చేశారు. ప్రముఖ హరియార రచయిత శ్రీ కిరస్తవిహారి ఆచార్య, ఆయన సతీమణి, స్థానిక రచయితలు, రచయిత్రులు సభలో పాల్గొన్నారు.

## దంతవైద్యుల ఉదంతం!

దంత వైద్యులు అమెరికన్ డెంటల్ ఎసోసియేషనులోంచి తీసుకున్న పుస్తకాలను తిరిగి యివ్వకపోడం, చివరికి వాటి ఖరీదునయినా చెల్లించకపోడం బాగా అలవాటు చేసుకున్నారన్న కనుక అసలు పుస్తకాలను యింటికి యిచ్చే పద్ధతిని నిలిపివేయాలని కూడా ఆ లైబ్రరీ ఆలోచిస్తోందని ఇండియన్ డెంటల్ ఎసోసియేషను జనరల్ సెక్రటరీ డాక్టరు జి.ఆర్. ఖట్ అన్నారట.

## జీవితానికి హేమమాలిని నిర్వచనం!

జీవితమంటే సుఖమయ సంసారమనీ, చక్కని కొడుకునూ, కూతురునూ కనడమేననీ అంతే ధర్మేంద్రలాంటి మొగుడును కనడం యింకా సుఖమయ సంసార సారమనీ నటి 'హేమమాలిని' అన్నదట. ఇదిలావుండగా 1976లోనే తనకూ హేమమాలినికీ వివాహం అయిపోయిందనీ. అయితే అనివార్యకారణాలవల్ల యీ విషయం వెల్లడి చేయలేదనీ నటుడు ధర్మేంద్ర అన్నారట– పోనీ, మనకేల!

## బొద్దింకల నివాసంగా మారిన బోయింగ్!

బోయింగ్ 747 విమానాలలో కల్లా పెద్ద, గొప్ప విమానం. జర్మనుదేశానికి చెందిన బొద్దింకలు తమఅంతస్థునూ, స్థాయినూ పెంచుకుని. యీ బోయింగ్ విమానాలే తమ గృహాలుగా వాడుకుంటున్నాయట. ఈ బొద్దింకల బెడద ఎక్కువగా వున్నదని బ్రిటిష్ ఎయిర్వేస్ సంస్థ ఆరోగ్య సలహాదారుడు విలియమ్ హార్న్ వాపోయారట.

**సైన్సులో సరదాలు**

# చిల్లులలోంచి మంట వెడుతుందా ?

"చిల్లులలో నుంచి మంట దూరి వెళగలదా ?" అని మీ స్నేహితులెవరినైనా అడిగి చూడండి.

"విశేషంలా వెడుతుంది" అని సమాధానం ఇస్తారు తడుము కోకుండా.

"వెళ్ళకుండా నేను మంత్రం వెయ్యగలను" అని నువ్వు అంటే నమ్మలేనట్టు చూస్తారు. ఈ గారడీ చెయ్యడానికి—

1. కొవ్వొత్తి, 2. అగ్గిపెట్టె, 3. టీ వడపోసుకునే తీగల చట్రం ఉంటే చాలు. కొవ్వొత్తి వెలిగించి నేలమీద నిలుపెట్టు. టీ వడపోసుకునే తీగల చట్రంగాని, మరొకవైన తీగల వల లాంటిది ఏదైనా గాని తెచ్చి, కొవ్వొత్తి మంట మీద పెట్టి చూడు. వలకింద మంట మామూలుగానే మండుతూ ఉంటుంది కానీ, వల పైభాగాన మంటఉండదు! కేవలం తెల్లని పొగ మాత్రం వస్తూ ఉంటుంది. మంటని పట్టుకుని కత్తిరించేశారా అన్నట్లు ఉంటుంది.




మీ స్నేహితులు ముందర ఆశ్చర్యపోయి తరువాత కాస్త తేరుకుని, కొత్త అభ్యంతరం లేవదీస్తారు.

"వల కన్నాలు మరీ అంత చిన్నవిగా ఉంటే వాటిలోంచి మంట దూరకేం ?" అని అప్పుడు అగ్గిపుల్ల వెలిగించి, వల పై భాగాన కనిపిస్తున్న పొగలు పెడితే, వలపైగ నున్న మంట వస్తుంది! వల కింద నున్న మంటకీ, పైన ఉన్న మంటకీ మధ్య కాస్త విడం ఉంటుంది.

ఇప్పటికీ మీ స్నేహితులు ఓటమిని అంగీకరించక "వల కన్నాలు మరికాస్త పెద్దవి అయితే మంట తప్పకుండా వాటిలోనుంచి దూరుతుంది" అని వాదిస్తారు. వాళ్ళని సంతృప్తి పరచడానికి, మీరాయి బూంది తీసే పెద్ద చిల్లుల చట్రం తెచ్చి, దానితో గారడీ మరోసారి చేసి చూపించు. అంత పెద్ద చిల్లులలో నుంచి కూడా మంట బయటికి రాదు.

ఇంతకీ ఈ విచిత్రానికి కారణం ఏమిటి? లోహంతో చేసిన చట్రం చక్కని ఉష్ణవాహకం కావటంచేత మంట తాలూకు వేడిమిని అతివేగంగా అన్నివైపులకి ప్రవహింప చేసి, పొగ పై భాగాన ఉన్న తెల్లని "పొగ" మండడానికి తగినంత వేడిని అందకుండా చేస్తుంది. ఏ వస్తువైనా సరే మండాలంటే తగినంత ఉష్ణోగ్రత ఉండాలని చెప్పుకున్నాం కదా ? ఆ "పొగ" మండడానికి తగినంత ఉష్ణోగ్రత ఏర్పడనీయకుండా వేడిమిని దూరానికి పంపించేస్తూ ఉండడంచేత వల పై భాగాన మంట ఉండదు.

వల పైన అగ్గిపుల్ల గీసినప్పుడు మళ్ళీ ఉష్ణోగ్రత తగినంతగా పెరగడం చేత మంట మళ్ళీ కనబడింది.

ఈ సిద్ధాంతాన్ని ఉపయోగించుకుని 1816లో "డేవీ" అనే విఖ్యాత శాస్త్రజ్ఞుడు ఒక దీపాన్ని కని పెట్టేడు. ఆ కాలంలో బొగ్గు గనులలో తవ్వకానికి వెళిన కూలీలు దీపం ఏదైనా తీసుకువెడితే, గనిలో తయారయ్యే కొన్ని విష వాయువులు దీపపు వేడికి భగ్గుమని పేలిపోయేవి. విపరీత జననష్టం జరిగేది. దీపం తీసుకు వెళకపోతే చీకటిలో పని జరుగదు కదా ?

గనిలో పేలుళ్ళు జరుగకుండా వెలుగు మాత్రం ఇచ్చే దీపాన్ని తయారు చేయడం సాధ్యమా అని డేవి ఆలోచించాడు. దీపానికి గాజు చిమ్నీ పెట్టినా దీపం వేడికి చిమ్నీ వేడెక్కి, దానివల్ల చుట్టూ ఉన్న విష వాయువులు వేడెక్కి పేలుడు సంభవిస్తుంది. కనుక గాజు చిమ్నీలాభం లేదు. దానిబదులు రాగితీగల చట్రంతో చిమ్నీ తయారు చేసి దీపానికి పెట్టేడు డేవీ. మంటవేడికి రాగిచట్రం అతివేగంగా అన్ని వైపులకి పరచేసి, ఏ ఒక్కచోటా ఉష్ణోగ్రత మరీ ఎక్కువ కాకుండా చేస్తుంది. పేలడానికి తగినంతగా ఉష్ణోగ్రత పెరగక పోవటం చేత ప్రమాదం జరగదు. వల చిల్లులలో నుంచి వెలుగు మాత్రం బయటకి వస్తూ ఉంటుంది.

పద్ధతి బాగుంది కదూ ?

—డా॥ మహీధర నళినీమోహన్.



# అవీ-ఇవీ-అన్నీ

## వి ము క్తి

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా పడిన ఎం. డి. సౌజన్య రచన "విముక్తి" నవల పుస్తక రూపంలో వెలువడింది. ముస్లిం యువతులను మోసగించి అరేబియా దేశాలకు ఎగుమతి చేసే దురాచారాన్ని ఖండిస్తూ, తెలుగు ముస్లిం సంస్కృతిని ప్రతిబింబిస్తూ వ్రాసిన యీ నవలను మారుతీ పబ్లికేషన్సు, ఏలూరురోడ్డు, విజయవాడ-2 వారు ప్రచురించారు. 164 పుటలు వెల అరు రూపాయలు. ముఖచిత్రం గెటప్ బాగున్నాయి. అట్టమీద బొమ్మ వేసినది వి. యస్. ప్రకాశ్. ప్రతులకు ప్రచురణకర్త పేర వ్రాయాలి.

## శ్రీ సాయి సకార సహస్ర నామావళిః

రచన : శ్రీ బుడ్డిగ అదినారాయణమూర్తి. 44 పేజీలు, అమూల్యం. ప్రతులకు : శ్రీ సాయి రామభక్తసమాజము, సోమగుండం తూర్పు వీధి, 26వ వార్డు, భీమవరం, పశ్చిమగోదావరిజిల్లా.

## శ్రీ లలితా సహస్రనామ గేయామృతము

రచన : శ్రీమతి మంథా విశాలాక్షి. 94 పేజీలు, వెల మూడు రూపాయలు. ప్రతులకు : లలితా శ్రమం, లలితా నగరం, విశాఖపట్టణం-530 016. లేదా రచయిత్రి పేర ప్లాటు నెం. 144, జామై ఉస్మానియా రైల్వే స్టేషన్ ఎదురుగా, లలితానగర్ కాలనీ, సికిందరాబాదు-500 044.

## శ్రీ వల్లభరాయదేవ స్తోత్రమ్

రచన : జగద్గురు శ్రీ శ్రీ నృసింహానంద భారతీ మహాస్వామి. 80 పేజీలు, మూల్యం-సార్థరూప్యకం. ప్రతులకు : శ్రీమాన్ దేవి హనుమాచార్యులు (శ్రీ వల్లభరాయ దేవస్థాన ప్రధానార్చకులు), స్వర్ణ (పోస్టు), చీరాలతాలూకా, ప్రకాశంజిల్లా.

## అంధులకు వెలుగు

రచన : శ్రీ కె. రామారావు. 44 పేజీలుగల ఈ పుస్తకంలో అంధుల మానసిక ప్రవృత్తులు, తల్లిదండ్రులకు సూచనలు, ఏకీకృత విద్యా విధానం, చదువు, వ్రాత, అంధుల చరిత్ర, కంటి జబ్బులు - తీసుకోవలసిన జాగ్రత్తలు, అంధుల పునరావాస సమస్యలను రచయిత వివరించాడు. పుస్తకంలో ఎక్కడా వెల ఎంతో



## 'శ్రీశ్రీ' మీద మిరియాల రామకృష్ణ థీసిస్‌కు "డాక్టరేట్" ప్రదానం.

'శ్రీశ్రీ కవిత్వం వస్తు సంవిధానం' అన్న అంశంపై పరిశోధన చేసిన కాకినాడ కళాశాల తెలుగు లెక్చరర్ శ్రీ మిరియాల రామకృష్ణకి ఆంధ్రా యూనివర్సిటీ వారు "డాక్టరేట్" పట్టా ప్రదానం చెయ్య నిర్ణయించారు. 3 సం॥ల పాటు శ్రీ రామకృష్ణ యీ కృషి చేసి కృతకృత్యు లయ్యారు.

తెలుపలేదు. ప్రతులకు, వివరాలకు రచయిత పేర ఇంటి నెంబరు 3-1-403/1, నింబోలి అడ్డ హైదరాబాదు-500 027 కు వ్రాయాలి.

## అ డ వి పూ లు

వచన కవితా సంపుటి. రచన : శ్రీ గన్ను కృష్ణమూర్తి. 72 పేజీలు. వెల 4 రూపాయలు ప్రతులకు రచయిత పేర జూనియర్ లెక్చరర్ ప్రభుత్వ జూనియర్ కళాశాల, నారాయణ ఖేడ్, మెదక్ జిల్లాకి వ్రాయాలి.

## కన్యాశుల్కము పాత్రల పరిశీలన

మహాకవి గురజాడ రచించిన కన్యాశుల్కము నాటకంలోని వివిధ పాత్రలపై "తెలుగు వెలుగు" సాహితీ సంస్థ సభ్యులు వ్రాసిన పరిశీలనా వ్యాసములను ఈ పుస్తకంలో పొందుపరచారు. 52 పేజీలుగల ఈ పుస్తకం వెల మూడు రూపాయలు. ప్రతులకు : తెలుగు - వెలుగు, బి. హెచ్. ఇ. ఎల్. టౌన్‌షిప్, రామచంద్రపురం, హైదరాబాదు-32 కు వ్రాయాలి.

## సుఖమూ - సుందరి

నవల. రచన : శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథ రావు. 156 పేజీలు. వెల 6 రూపాయలు ప్రతులకు : శ్రీ కవితా పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2.


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

